సీ. ప్రిదిలినకొప్పులు • రాలినపూఁతలు, మారినవసనములుఁ • గ్రాలువారు
నిద్దురమంపులు • నెఱిమద్యగంపులుఁ, జెమ్మటమోములుఁ • జెలఁగువారు
శ్రమవారిఁ దడిసిన • సుమహారములవారు, మాలికాకులఁ జిక్కు • వాలివారు
కెంపులుఁగన్నులుఁ • జెలువంపుఁజన్నులు, మేలగువన్నెలు • నెఱయువారు

తే. రాఁగ రాగంబునను వెంట • రామవిభుని
కాంత మది నుంచి తమిఁ జెంది • కళవళించి
మౌఢ్యము వహించి మర్యాద • మట్టగించి
క్రించు టసురుండు వనముఁ జొ • త్తెంచుటయును. ౮౫

అర్థములు. మంపులు = మత్తు, శ్రమవారిన్ = చెమటనీళ్ళచే. మాలి కాకుల = పూలదండలు తాళువమాలుగా నున్న, చిక్కువాలివారు = తలవెండ్రుకలు గలవారు, కెంపులు = ఎఱ్ఱనైన, క్రించు టసురుండు = దుష్టరాక్షసుఁడు.

తాత్పర్యము.

వీడిన కొప్పులు, రాలిపోయిన గంధపుఁ బూఁతలు, వ్యత్యస్తముగాఁ గొలఁగిన వసనములు, నిద్దుర మబ్బులు, మద్యము వాసనలు చెమటగారు ముఖములు, చెమట నీళ్ళచేఁ దడిసిన పూలదండలు, పూలదండలు కలసి చిక్కుపడిన వెండ్రుకలు, ఎఱ్ఱని కన్నులు, అందమైన స్తనములు, స్నిగ్ధమైన కాంతులు గల స్త్రీలను రాగముచేఁ దన వెంట రాఁగా దుష్టుఁడగు రావణుఁడు సీతాదేవిని దలఁచుకొని కామాతిశయముచే దత్తఱలాడి సీత తనకు వశపడు నని మూఢుఁడై తలంచి పరస్త్రీల విషయమున నుండవలసిన మర్యాద వదలి వనము ప్రవేశింపఁగా.

కం. అంజనతనయుఁడు రావణ, కుంజరగమనావళీ ని • కూజత్కాంచీ
శింజితములు శ్రవణపుటీ, రంజక హంసకనికాయ • రవములు వినియెన్. ౮౬

అర్థములు. రావణకుంజరగమనావళీ = రావణాసురుని స్త్రీసమూహముల యొక్క, నికూజత్కాంచీ = ధ్వనించుచున్న మొలనూళ్ళ, శింజితములు = ధ్వనులు, శ్రవణపుటీ రంజక = చెవులకు నింపైన, హంసక నికాయరవములు = అందెల సమూహముల ధ్వనులు.

తాత్పర్యము.

హనుమంతుఁడు సీతాదేవి సమీపమునకుఁ బోవలె నని యాలోచించు సమయమందు రావణాసురుని స్త్రీల యొడ్డాణముల యందలి గజ్జెలధ్వనులు, విన నింపైన యందెల నాదము వినవచ్చెను.

ఉ. ద్వారము దాఁటి యున్న సురవైరి సతీశ్వరు, గంధహస్తి యసి
క్రొవ్వున దీపికల్ గొని త • లోదరు లేఁగ వెలుంగు కాముని

వెలుగుచు గనఁబడెను. ఏమి యీ వెలుగని తలయెత్తి నిక్కి-చూడఁగా రావణుఁడు, ఆవల వాని వెనుక వచ్చు స్త్రీలు గానవచ్చిరి.

ఉ. తారలు గూడియున్న యల•తారకరాజును బోలి సుందరీ
వారము చుట్టు గొల్వఁగను • వచ్చెడివాని లసత్పరిష్క్రియా
హారవిలాసునిం బటుమ•హాబలభాసునిఁ గామదాసునిన్
హారిశరీరు విశ్రవసు•నాత్మకుమారునిఁ గాంచి యాత్మలోన్. ౫౦౧

అర్థములు. తారకరాజు = చంద్రుఁడు, నక్షత్ర పర్యాయమున తారక శబ్దము పుంలింగ మందును గలదు. లసత్ = ప్రకాశించు, హారములయొక్కయు, పరిష్క్రియా = ఆభరణములయొక్కయు, విలాసునిన్ = సౌందర్యము గలవానిని.

తాత్పర్యము.

నక్షత్రములతోఁ గూడిన చంద్రునివలె స్త్రీలు తన్నుఁ జుట్టుకొనఁగా వచ్చుచున్నవానిని, ప్రకాశించు హారములు, ఆభరణములు వీనిచే సుందరుఁడైన వానిని, మహాబలవంతుని, కామమునకు దాసుఁడైనవానిని, మనోహరమైన శరీరము గలవానిని, విశ్రవసు కుమారునిఁ జూచి హనుమంతుఁడు తనలో నిట్లనుకొనెను.

మ. అగుఁ బో యీతఁడె రావణుం డనుచు ర•క్షోధీశుఁ గానంగ నీ
లగు స్థానంబును జేరి భూరిబలుఁడై • యా నీచు తేజంబునన్
విగళత్తేజుఁడు నొచ్చుఁ గొమ్మలను దా•గెన్ వాయుసూనుఁడు సుస్తనిన్
జిగురుంబోఁడి సుగాత్రి నాయ నదరం•చెం జూడఁ గాంక్షించుచున్. ౫౦౨

అర్థములు. స్థానము = ప్రదేశము, విగళత్తేజుఁడు = జాఱిపోయిన తేజము గలవాఁడు, దాఁగెన్ = దాఁగుకొనెను. క్వచిద్గకారో వః అను సూత్ర ప్రకారము గకారమునకు వకారము వచ్చెను. అగుఁబో = నిశ్చయముగా నగును.

తాత్పర్యము.

నిశ్చయముగా వీఁడు రావణుఁడే యని తలఁచి వానిని చక్కఁగాఁ జూచుటకు తగినదైన స్థలముఁ జేరి అవఁగా వానికి నెదురు ముఖముగా నుండునట్లు విస్తారబలము గలవాఁ డయ్యును వాని తేజస్సు ముందర తేజోహీనుఁడై కొమ్మలసందున దాఁగుకొనెను. వాఁడును సీతను జూడ సమీపించి వచ్చెను.

—• ౧౯-వ సర్గము. రావణుఁడు సీతాదేవిని జేరఁబోవుట. •—

చ. తదయుక సీత గాంచి దప్పు•దప్పుల భూషణభూషితాంగుఁడై
పడఁతులతోడ వచ్చు సుర•భంజను యౌవనరూపవైభవున్
వడఁకుచు నోరుగాలికి వ•ణంకు ననంటినిబోలి యూరులన్
గనుపును బాహులం జనులు • గ్రక్కన మూయుచు నేడ్చుచుండఁగన్. ౫౦౩

తా త్ప ర్య ము.

ఆభరణములచే నలంకరించుకొని యువతులతో వచ్చుచున్న రావణుని నూతన సౌందర్య సంపత్తి గలవానిని దూరమునందే చూచి సీతాదేవి పెనుగాలికి నరఁటి చెట్టువలె గడగడ వణఁకుచు నాలస్యము లేక తొడలచేఁ గడుపును చేతులచే స్తనములను గప్పుచు నేడ్చుచుండెను.

సొమ్ములు మూటఁగట్టి యుత్తరీయమును బాఱవైచిన కారణముచేఁ బైఁటయు లేక యుండుటచేఁ గడుపు గానరాకుండఁ దొడలను సొమ్ములు గానరాకుండ పెద్దకాళ్ళను వక్షముంచి ఆ కాళ్ళను రెండుచేతులు కట్టుకొని బిగించె నని భావము.

సీ. దశకంధరుం జూచి • దర్పించె రాకాసి, మూఁకి గావఁగ నార్తి • మునుఁగుదాని
జలనిధి నవిసిన•కలముఁబోలినదాని, నుత్తనేలను గూరు•చున్న దానిఁ
గొట్టి వైచినపూవుఁ•గొమ్మ దీటవుదాని, నతులితసంశిత•వ్రతముదానిఁ
బంకపు నగను బల్•వన్నె లీనెడు దాని, నొంటి నేడ్చుచు జింత నొందుదాని
ఆ. బురద గ్రమ్మియున్న•సరసిజం బనఁగను, మెఱసి మెఱయ కుండు•మేనిదాని
మండనార్హ యయ్యు•మండనంబులు ద్రోచి, యునలుదాని నవయు•నొప్పలిదానిఁ

అర్థములు. అవిసిన = పగిలిన, కలము = ఓడ, అతులిత = అసమానమైన, సంశిత = మిగులఁ దీక్ష్ణమైన, వ్రతిన్ = వ్రతము గలదానిని, నిద్రాహారములు రెండును విడిచి కటికి నేలపైఁ గూర్చుండిన తీవ్ర వ్రతము గల దానిని, పంకపు నగను = దుమ్ము నిండి యాభరణముచే, మండనార్హ = అలంకారమునకు యోగ్యురాలు, మండనంబులు = ఆభరణంబులు.

ఈ పద్యము మొదలు పండ్రెండు పద్యములు కుళకము.

ఈ పద్యము నారంభంబున దశకంధరుఁజూచియుఁ గడపటి పద్యంబున దశాస్యుఁజూచియుఁ బ్రయోగించుట, కర్తృ పదము మఱవ కుండుటకై దూరాన్వయము నివారించుటకై యని తెలియునది. ఈ నడుమ నుండిన వన్నియు సీతాదేవి విశేషణములు.

తా త్ప ర్య ము.

రాక్షస స్త్రీల గుంపు తన్ను రక్షింపఁగా దుఃఖించు చుండు దానిని, సముద్ర మధ్యమున పగిలిన యోడవలె దరిగానక యుండు దానిని, కటికి నేలపైఁ గూర్చుండిన దానిని, తెగఁగొట్టివైచిన పూవు తీఁగవలె నుండుదానిని నిద్రాహారములు మాని మిగులఁ దీవ్రమైన వ్రతము పట్టిన దానిని, దుమ్ము గ్రమ్మిన దేహము గల దానిని, తన వారెవ్వరు లేక యొంటిగ దుఃఖించుచుండు దానిని, బురద సోఁకిన కమలమువలె కాంతి గలిగి లేకున్న దానిని, ఆభరణములు ధరింప యోగ్యురాలయ్యు ధరింపని దానిని, శుష్కించిన దేహము గల దానిని.

నాయందు లేదయిన దోష ముండినను క్షమించి నన్ను రామచంద్రమూర్తి రక్షించునని భావము. రామభద్రమునిన్ = "భద్రశబ్దేన దేవస్య నిత్యనిర్దోష తోచ్యతే"(అహి.౫-౭౯) నిత్యనిర్దోషత్వము గల రాముని నని భావము. సంకల్పము = ప్రాణము, 'ప్రాణో మహాయా క్రియాశక్తిర్వ్యాప ఉక్తస్య ఉద్యమః॥ సుదర్శనంచ సంకల్పః శబ్దాః పర్యాయ వాచకాః॥ (అహి. ౧౬ అధ్యా.) హయ=త్వరగాఁ బోవునది, త్వరగాఁ బోవునట్టి ప్రాణవాయువులచే, పొంకంబుగన్ = దృఢముగ, చలింపకుండ నని యర్థము. రథ శబ్దమునకు = దేహము - మనోరథము, రథము, వాహనము నని యర్థము. హృద్రథమనఁగా హృదయ మను రథము. (౨) హృదయ మను శరీరము.బోవుడి దానిన్ = పోవుచున్న దానిని, ఇక్కడ లేదని భావము.

తా త్ప ర్య ము.

ఎట్టి కళంకము లేనివాఁడును, తల్లియందుకంటె ప్రేమకంటె నెక్కువ ప్రేమ తనయందుఁ గలవాఁడును, తనయందు దోష ముండినను దానిని హరింపఁ జేసి స్వీకరించువాఁడును, నిత్య నిర్దోషుఁడు నగు రామచంద్రమూర్తి యొద్దకు సంకల్పము లను గుఱ్ఱములను గట్టిన హృదయ మను రథము నందుఁ గూర్చుండి పోవుచున్న దానిని.

హృదయమునే శరీరముగాఁ గల ప్రాణము లతివేగముగఁ బోవుచున్న వని యైనఁ జెప్పవచ్చును. అనఁగా సీతాదేవి శరీరమం దున్నదే కాని ఆమె హృదయము, ప్రాణము, భావము, సర్వము రామునొద్దకుఁ బోయిన వని భావము. భక్తులు, పతివ్రతలు నిట్టివారై యుందురు.

క. అపవాదముచేఁ జేరకు, నిపతిత మగు కీర్తిఁ బోని ♦ నెలఁగుకయున్నన్
వ్యపకలితాభ్యాసం బగు, కృపణుని విద్యయునుబోలెఁ ♦ సీవ్వకుదానిన్. ౫౦౭

అర్థములు. నిపతితము = పడిపోయినది. వ్యపకలితాభ్యాసము = అలవాటు తప్పినది, చింతనలేనిది, కృపణుని = లోభివానియొక్క.

తా త్ప ర్య ము.

నిష్కారణ నిందచేఁ జెడిన కీర్తివలె నున్నదానిని, ధనము మీఁదనే దృష్టి గలిగి లోభియై గుఱువున కీయవలసి వచ్చునే యని సరిగా నభ్యసింపని వాని విద్యవలె నుండుదానిని.

చ. నమసిన కీర్తి, నాదరము ♦ చాలని శ్రద్ధఁ, బరిక్షీణంబు నై
యుమలిన పూజ, భగ్న యగు ♦ నాశను, విఘ్నయుతోప లాభమున్
గమరిన విద్యనున్, మిగులఁ ♦ గారెడి నక్కయు, భగ్న పూజనున్
దమముచు గూరు నిల్చుచు, నిశాఘనమునందలి దీప్తిఁ బోలుచున్. ౫౦౮

తా త్ప ర్య ము.

నశించిన కీర్తిని, ఆదరింపఁబడని శ్రద్ధను (శ్రద్ధగలవాని నాదరింపకున్న నా శ్రద్ధ క్షీణించి పోవును.) పూజా ద్రవ్యములు లేని పూజను, చెడిపోయిన యాశను.

తా త్ప ర్య ము.

ఇట్లు పరికించి రావణుఁడు తియ్యని మాటలతో తన మనస్సులో నున్న యాలోచనలు స్పష్టముగాఁ దెలియునట్లు పతివ్రతాశిరోమణియైన సీతాదేవితో నిట్లనెను.

ఉ. ఏటికి నన్నుఁ జూచి జల•జేక్షణ! దాఁపఁ గుచోదరంబు, లి
ట్లేటికి కోకొ వణంకఁ, బరు • లెవ్వరొకో కరభోరు! యిందు, నా
మాటను బాటిగాఁ గొనుము • మత్ప్రియురాల! బహూకరింపు నన్,
మేటిసురూపతాఖనివి • నీవ గదే జగదేకమోహినీ. ౫౧౭

అర్థములు. కుచ + ఉదరంబును = స్తనములను కడుపును, కరభోరు=కరభమువంటి తొడలు గలదానా! కరభము = మణికట్టు మొదలు చిటికెనవ్రేలి మొదలు దాఁక చేతి వెలుపలి చోటు. (౨) ఏనుఁగుతొండము. సురూపతా = సౌందర్యమునకు. ఖనివి = గనివైన దానవు.

తా త్ప ర్య ము.

నా ప్రియురాల! జగములను మోహింపఁజేయుదానా? నన్నుఁ జూచి యేల నీవు కడుపును, చనులను దాచిపెట్టెదవు. ఏల యిట్లు వణఁకుచున్నదానవు. ఇక్కడఁ బరు లెవరున్నారు. నా మాట వినుము. నన్ను గౌరవింపుము. నీవేకదా సౌందర్యమునకు గని యైన దానవు.

ఆ. కలికి మనుజులైనఁ • గామరూపధరులు, రాత్రిచరులునైన • రాజవదన!
యిందులేరు నీకు•నేటికి భయపడ? నాకు వెఱవ వలదు • నళిననేత్ర! ౫౧౮

తా త్ప ర్య ము.

కాంతా! ఇచట నీ జాతిలోఁ జేరిన మనుష్యులు లేరు. నా జాతికిఁ జేరి కామరూపధరులైన రాక్షసులు లేరు. నీ వేల మెవరు చూచి యేమనుకొందురో యని భయపడెదవు. నాకు నీవు భయపడవలసిన పనిలేదు. నేను రాక్షసుఁడ నైనను నీ మీఁది కామమున వచ్చితినిగాని, నిన్నుఁ జంప రాలేదు.

క. పరదారగమనకేళియుఁ, బరదారాపహరణంబు • పద్మదళాక్షీ!
పరగుఁ గులధర్మమయి నిర్జరవైరుల కెల్ల భీరు • సందియ మున్నే. ౫౧౯

తా త్ప ర్య ము.

భీరు! నేను నీ భార్యనుగాను, పరభార్యలను నీవు కోరవచ్చునా యందువేమో, పరుల భార్యలను పొందుట, పరుల ధన మపహరించుట యను నాటలు రాక్షసుల కందఱకు నా కొక్కనికే కాదు కులధర్మము. ఓసి పిఱికి! దీనిలో సందేహము లేదు; ఇది కులధర్మ మగుటచే దోసము గాదు కావున నీకుఁ బాపభయ మక్కఱ లేదు.

క. రామా! యిది యిట్లయ్యు న,కామను నిన్నుఁ దాఁక నొల్లఁ • గామముచెలిమిన్
గామింపు యథాకామము,గా మైథిలి! నాకుపట్లఁ • గడుగామవతి వై. ౫౨౦

తాత్పర్యము.

సుందరీ! పరదారలను బొందుట నా స్వధర్మమైనను స్వధర్మము నిర్వహించుట నాకు విధమైనను, నాయందు నీకుఁ గామము కలుగ లేదు. కావున నా కింక కామ మున్నను నిన్నుఁ దాఁకుట కిష్టపడను. నీవే నీ కోరిక ప్రకారము యథేచ్ఛముగా నన్ను నా యందు దయయుంచి కామింపుము.

ఉ. దేవి! భయంబు నొందఁగ మ•దిం దగ దింకుఁ, బ్రసాదదృష్టి సం
భావన సేయు నన్ను వెత•పాల్పడఁబోకుము, యేకవేణి దు
ష్టావని శయ్యయున్ వరసు•భార్హ్మా శిలంబునఁ బస్తు లుంటయున్
నావికిచింతయున్ మయిల•వస్త్రము నీ కుచితంబులే యిటన్. ప.౨౧

అర్థములు. ప్రసాదదృష్టి = అనుగ్రహముతోఁ గూడిన చూపు, సంభావన= గౌరవము, దుష్టావని=పాడునేల.

తాత్పర్యము.

దేవీ! నీ విచ్చట భయపడరాదు. నన్ననుగ్రహదృష్టి గౌరవింపుము. వ్యసనపడ నలదు. ఒంటి జడ, గొడ్డునేల పడుక, సుఖపడలసిన చోట నుపవాసములు, వదలని విచారము, మాసినగుడ్డ యివి నీ కిచ్చటఁ దగునా?

ఉ. అందము లైన మాల్యనిచ•యంబులు దివ్యము లైన భూషలున్
జందనలేపనంబులును • జక్కని పెక్కు తెఱంగు చేలముల్
సుందరమందిరంబులును • సొంపగు పానకయాసనంబులున్
సుందరి నృత్తగీతములు • నూర్కొనుమీ నను బొంది మైథిలీ! ప.౨౨

తాత్పర్యము.

సొగసైన పూలదండల గుంపులు, దివ్యాభరణములు, దివ్య చందనపుఁ బూఁతలు, అనేకవిధములైన చీరలు, అందములైన యిండ్లు, సొంపయిన పానములు, పానుపులు, పీటలు, ఆటలు, పాటలు నన్నుఁగూడిన దానవై వీని నెల్ల నంగీకరింపుము.

క. స్త్రీరత్నమ! యిటు లుండకు; భూరివిభూషల ధరింపు • పువ్వుఁబోఁడీ! నన్
జేరియునున్ రుచిరాలం, కారములకుఁ బాసి యుండఁ•గాఁ దగు నోకో. ప.౨౩

అర్థములు. రుచిరాలంకారములకున్ = అందములైన సొగసులకు, ద్వితీయార్థమున షష్ఠి. షష్ఠీస్థానకంబగు కువర్ణకం బొక్కొక్కచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ బత్త్రవర్ణంబులఁ జూపట్టెడి. (ప్రౌ. వ్యా. కా. ౧౩.)

తాత్పర్యము.

స్త్రీలయందు శ్రేష్ఠురాలా! నీ వీ ప్రకారముగా నుండఁ దగదు. విలువగల యాభరణములను ధరింపుము. నాయొద్ద నుండియును నీవు మనోహరము లైన యలంకారముల విడిచియుండ వచ్చునా?

క. చను చున్నది నెఱుంగ వో, కనకాంగీ! హారియౌవనము నీకు వృథా
చనిచనియు మరలి వచ్చునె? వనజాక్షీ! వచ్చునా ప్రవాహము మఱలన్? ౫.౨౪

అర్థములు. హారియౌవనము = మనోహరమైన వయస్సు, "రతిర్వ్యాయామ సహానో మన్మథస్యైవ మత్తతా। విద్యతే యువభావో యస్తద్యౌవన మునాహృతమ్."

తాత్పర్యము.

పుష్పకోమలా! నీకుఁ బ్రాయము వృథా పోవుచున్నది. ఇది నీవు తెలియ లేవు కాబోలు. పోయిన ప్రాయము మఱలరాదు. ప్రవాహము మఱలి యెన్నడైన వెనుకకు వచ్చునా!

ఉ. నిన్ను సృజించి వెండి తరుణీ యలవిశ్వవిధాత రూపసం
పన్నల సృష్టి సేయుటను మానె దలంచుచుఁ దలంతు లోకమం
దన్నులమిన్న! నీకు సరియంగన లేమి నొకర్తుఁ, బూనుచుం
జన్నలు నైన నిన్నుఁ గని యబ్జముఖీ! విడనాడి పోవునే. ౫.౨౫

అర్థములు. విశ్వవిధాత = ప్రపంచము సృష్టిచేసిన బ్రహ్మ, రూపసంపన్నలన్ = సౌందర్యలక్ష్మి గలవారల, అన్నులమిన్న = స్త్రీలయందు శ్రేష్ఠురాలా, నలువైన = నలువ + ఐనన్ = బ్రహ్మయైనను, నలు + వ = నలు + వాయి = నాలుగు వదనములు గలవాఁడు.

తాత్పర్యము.

నిన్నుఁ బుట్టించిన తరువాత బ్రహ్మదేవుఁడు సౌందర్యవతు లగు స్త్రీలను సృష్టి సేయుటయే మానె నని తలఁచెదను. సలక్షణ యౌ స్త్రీరత్నమా! నీకు సరి యైన స్త్రీ లోకమున లేదు. నీ కంటె సుందరితను సృష్టింప యత్నించినను నది వ్యర్థ ప్రయత్నమగును. ఆ పనికిఁ బూనఁ జేల, యవమాన పడనేల యని యూరకుండె మానుకొనెను. నీవు లభించినపుడు మగవాఁడా బ్రహ్మయైనను నిన్ను వదలి పోవునా!

ఈ రావణ వాక్యములను మహేశ్వరతీర్థీయ మందు భక్తిపర్యాయముగాఁ గల్పించి వ్రాయఁబడియున్నది. అది వాస్తవమునకు విరుద్ధ మని యుండినచోఁ బ్రాయఁబడెను. ఈ విషయమున తిలకవ్యాఖ్యయం దీ వాక్యములు గానవచ్చెడిని. 'ఉద్ప్రకేషు తీర్థ స్వాన్యజా రయోజనం భ్రాంత్యైవ, రక్షస్తమోగుణావిష్టస్య భగవన్మాయామోహిత స్యాకృత్యేష్వేవ ప్రవృత్తేః। తథా క్రియమాణానాం భగవద్ధ్యాన మపి పాపభోగోత్తరం జన్మాంతరే ఉత్తమఫలాయేతి బోద్ధవ్యం ... . ....ఏవంచ భగవతో నిందావిరుద్ధభావేన ధ్యాన మపి నరక భోగోత్తరం జన్మాంతరే ఉత్తమ ఫలాయ। అత ఏవాస్య మరణోత్తరం చతుర్థ్య చతుర్యుగ్యాం వేదిరాజకులే జన్మ, చతుర్వింశతి చతుర్యుగ్యాం రామావతారే శిశుపాలవంశోక్తేః। తావత్పర్యంతం నైరంతర్యేణ పాప ఫలభోగ ఇత్యర్థ ఆయాతి ఇతి బోధ్యమ్.

తాత్పర్యము.

సీతా! నీ వీ యజ్ఞానమును వదలుము. నాకు భార్యవు కమ్ము. నే నాయా దేశంబులందు బలాత్కారముగ గ్రహించి తెచ్చిన స్త్రీల యందఱిలో సంతోషముతో నీవు పట్టపు రాణివి గమ్ము. నే నందఱను బాధించి తెచ్చిన ధనములు, నేను, నా రాజ్యము నీ సొత్తే. ఇదిగాక యింకయుఁ గావలయు ననిన భూమినంతను, సకల నగరములను జయించి నీవు తృప్తిపడుటకై నీతండ్రికి జనకునకు సమస్తము నిచ్చువాఁడను. యుద్ధమునందు నా ధాటి సహింపఁగల శూరుఁ డెవ్వఁ డున్నాఁడే; యుద్ధములందు నా బలము, శౌర్యము నీవే చూడఁగలవు.

చ. ఒరగినటెక్కెముల్, రథము • లూడిన నాజులుఁ, గూలు తేరులున్
విఱిగిన విండ్లులుం, జెదరి • వ్రేలెడి వెంట్రుకలుం, దడంబడం
బఱచెడి పాదముల్, సిలుకు • మీఱెడి సేనలుఁ, గల్గి శత్రువుల్
పిఱికితనానఁ బాఱుదురు • భీతి ననిన్ దనుజాసురుల్ సతీ! ౨౭

అర్థములు. సిలుకుమీఱెడి=చచ్చుచున్న, అనిన్=యుద్ధమందు.

తాత్పర్యము.

సీతా! నేను యుద్ధము చేయునపుడు యుద్ధభూమి యెట్లుండు నని తలఁచితివో కదా! కట్టుత్రాళ్ళు తెగి దండములు విఱిగి నేలరాలిన ధ్వజములు, రౌతులు చచ్చిన గుఱ్ఱములు, తుప్పకూలిన తేరులు, విఱిగినవిండ్లు, భీతియుఁబోసికొని పరువెత్తు వారి వెంట్రుకలు, తడఁబడ పరువెత్తు కాళ్ళు, చచ్చుచున్న సేనాభటులు గలవారై దానవు లందరు, దేవతలందరు శత్రువు లగువారు భయపడి పరువెత్తుదురు.

ఉ. కన్నులకాంతుఁ దీరఁ గనఁ • గా మది గోర్చెదు నీదు రూపమున్
జెన్నగు భూషణంబులను • జెల్వ! ధరింపుము చూడ, నాకు దీ
ర న్నిఖిలేష్టభోగములఁ • బ్రాజ్యముగా భుజియింపు, క్రీడలన్
బన్నుగఁ దేలుమీ, సుధిర • పానకముల్ ముదమారఁ గ్రోలుమీ. ౨౮

తాత్పర్యము.

నీ సౌందర్యమును గన్నుల కోరిక దీరఁ జూడఁ గోరిక కలదు. కావునఁ జెలువా! దేహమున నాభరణంబుల ధరింపుము. నీ యాకోరిన సమస్తభోగములఁ బూర్ణముగ ననుభవింపుము. కేళుల వర్తింపుము. సంతోషముతో మనోహరములైన పానకములు త్రావుము.

మ. ధనమో భూమియో రాజ్యమో యొదియు నేఁ • దన్వీ! యథేష్టంబుగా
వనితా! దానము సేయుమీ, ననుఁ గృపా • భావంబునం జూడుమీ
కొనుమీ యెయ్యది గోరి నిచ్చెదను నీ • కు, న్నామయుం గూర్మిఁ జూ
పిన నీవారల కెల్ల సౌఖ్యములు ప్రా • పించున్ నిజం బాడెదన్. ౩౦

తాత్పర్యము.

నీ యిష్టప్రకారము ధనముగాని, భూమిగాని, రాజ్యముగాని, మఱియేదైనఁ గాని నీ యిష్టమువచ్చినవారికి దానము చేయుము. నన్ను దయతోఁ జూడుము. నీవేది కోరినను నిచ్చెదను. నా యందు నీ కనుగ్రహము గలిగెనా నీ బంధువుల కెల్ల సౌఖ్యములు లభింపఁజేసెదను. సత్యము చెప్పుచున్నాను.

తే. కలికి! నాదు సమృద్ధియుఁ • గలిమి కీర్తిఁ, గనుము ప్రీతి. వనాటుండు • గతధనుండు
చెలియ! చీరాంబరుండు ని • క్షిప్తవిజయుఁ, డతివ! స్థండిలశాయి నీ • పతి తలంప.

అర్థములు. వనాటుండు = అడవులందు సంచారము చేయువాఁడు, గతధనుండు = పోయినసంపద గలవాఁడు, చీరాంబరుండు = నారచీరలు కట్టువాఁడు, నిక్షిప్త = వదలఁబడిన, విజయుఁడు = గెలుపు గలవాఁడు, స్థండిలశాయి = నేలపైఁ బండుకొనువాఁడు.

తాత్పర్యము.

ఇంతసేపు తన్నుఁ బొగడుకొని యిఁక రాముని దూషించుచున్నాఁడు. కలికీ! నా సమృద్ధి, సంపద, కీర్తి వీనిని ప్రీతితోఁ జూడుము. ఇఁక నీ మగఁడో యిల్లు, వాకిలి, గుడిసె యైన లేక యడవులం దిరుగువాఁడు. సంపద లేనివాఁడు. కట్టుకొన మంచి వస్త్రములు లేక, నారచీరలు గట్టువాఁడు. గెలుపు లేనివాఁడు. పండుకొనుటకు నొక చాపయైన లేక నేలఁ బడి యుండువాఁడు. అట్టి దరిద్రరాముఁ డెక్కడ? నే నెక్కడ?

రావణుఁడు రామచంద్రుని దూషింప వలయు నని దూషించినను 'సత్యవాణీ సరస్వతి' యన్నట్లు వాని నోట సత్యవాక్కులే వచ్చెను. 'దూషిసాధి'వలె నని దాఁటుంగు నది. లేక ఘుణాక్షర న్యాయ మనినయైనఁ జెప్పవచ్చును. వనాటుండు=వన మనఁగా నీళ్లు, వానియందుఁ జరించువాఁడు నారాయణుఁడు, గతధనుండు = పొందఁబడిన లక్ష్మి గలవాఁడు, చీరాంబరుండు = అంబరము = ఆకాశము, అదియే వస్త్రముగాఁ గల వాఁడు, నిరావరణుఁ డని యర్థము=నిక్షిప్తవిజయుఁడు=చెడిపోని గెలుపుగలవాఁడు, స్థండిలశాయి = స్థండిల మనఁగా యజ్ఞభూమి, దానియందుండు వాఁడు.

ఉ. రాముఁడు నింత దాఁక నటఁ • బ్రాణముతోడుత నున్నవాఁడొ లేఁ
డో మది సంశయంబు, నిను • నువ్విలలోచన! చూడ నేనియున్
రాముఁడు చాలఁ, డగ్రమున • రాజిలఁ గొంగలు వార్షి కాంబుద
స్తోమము గప్పెనన్ వశమె • చూడఁగ వెన్నెల నెట్టివారికిన్? ౫౩౨

తాత్పర్యము.

సీతా! రాముఁడు రాముఁ డని యంగలార్చెదవే, రాముఁ డింకను బ్రతికి యున్నాఁడో, చావలేదనుట యేమి నిశ్చయము. ఒకవేళ బ్రతికియున్నాఁ డనుకో, నిన్నుఁ జూచుట కైనను రాముఁడు చాలఁడు. ఎట్లన ముందు కొంగ లన్నియు

వ్యాపించి వానికైన నాన ముఖ్య పూసిఁ గ్రహింపనప్పుడు కన్నులను జాచుట కెవరి కైన సాధ్యపడునా ? అట్లులే సముద్రమును దాఁటి నన్ను గెలిచిరిదా నీ యొద్దకు రావలె, అదెట్లు రాఁగలదు ?

తే. వృత్రశాత్రవకరగత • హేమకశిపు,కీర్తి చందంబునను రాము•మూర్తి మఱల
నాదు హస్తంబునను దుంకి•వశివనేత్ర! నిన్ను గ్రహియింప నెట్టులు•నేర్చుఁ జెపుమ.

అర్థములు. వృత్రశాత్రవ కరగత = ఇంద్రునకు వశపడిన, హేమకశిపుకీర్తి =హిరణ్యకశిపునికీర్తి, ఇక్కడఁ గీర్తికారణమైన భార్యయని గ్రహింపవలయును. భార్యాహరణము కీర్తిహరణమేకదా, హిరణ్యకశిపుని భార్యను ఇంద్రుఁడు హరింపఁ గలిగెను గాని రాముఁడు నాచే జిక్కిన నిన్ను మఱల హరింపఁజాలఁడు. మఱల రాముఁడు నిన్ను హరించెనేని నా కీర్తి హరించినట్లే. అది యెన్నఁటికిని గాఁజాలదు. ఇంద్రుఁడు హిరణ్యకశిపుని భార్యను హరించి నారదాశ్రమమున నుంచె ననియు మఱల హిరణ్యకశిపుఁడు నారదు మూలమున నామెను గ్రహించె ననియు భాగవతమునఁ గలదు. ఇది వైధర్మ్య దృష్టాంతము. రావణాసురుఁడు సీతను హరించినట్లులు హిరణ్యకశిపుఁ డింటలేని సమయంబున నింద్రుఁ డాయన భార్యను కయాధువును హరించెను. ఆవల వాఁడు నయమునకో, భయమునకో మరలఁ దెచ్చుకొనెను. నీవు నాభార్యవు, నిన్ను రాముఁడు నయమునఁగాని, భయమునఁగాని హరింపఁజాలఁడు. ఇట్లు చెప్పి నను చెప్పనచ్చును. తన్ను గొప్పగాఁ జెప్పుకొనుటకై యింద్రునితోఁ దన్నుఁ బోల్చుకొనెను.

క. అందం బగు చిఱునగవున, సుందర రదనమునఁ గనుల•సొబగున వినతా
నందనుఁడు శేలిహానము, చందమున హరించె దీవు • సకి నా మనమున్. ౫౩౪

అర్థములు. లేలిహానము = పాము.

తా త్ప ర్య ము.

అందమైన చిఱునవ్వుచేత, సుందరములైన దంతములచేత, కన్నుల సొగసు చేత, గరుత్మంతుఁడు పామును హరించినట్లు నీవు నా మనస్సును హరించుచున్నావు. ఈ యుపమానము సీతాదేవి రావణుపాలికిమృత్యుదేవత యని సూచించుచున్నది. మృత్యుదేవత యేదియో రోగమో, నొప్పియో నెపముపెట్టి యెట్లు చంపునో యట్లులే సీతయు రామునిచేత రావణుని జంపించు నని భావము.

ఉ. మాసినచీరఁ గట్టి, నెఱి•మాలి యలంకృతి లేక బిక్కిలిన్
గాసిలు చున్నయిట్టి నినుఁ • గాంచుట నా ప్రియురాండ్రతోడ ని
శ్వాసముగా రతిం జలుపఁ•జాలన, కంటె సమస్తసద్గుణా
వాసఁట మత్పియుల్ ముగుద! • వారల కెవ్వరి నైౖ చెలంగవిటా. ౫౩౫

తా త్ప ర్య ము.

మాసిన చీరగట్టుకొని, సొగసు వదలి, యాభరణములు ధరింపక బిక్కిలి కష్ట

పడుచున్న నిన్నుఁజూచి నిశ్చింతముగా నా భార్యలతో నేను క్రీడింపలేకున్నాను. అయ్యో! సీత యింత కష్టపడుచుండఁగా నాకేమి సుఖ మని మనస్సంతయు నీమీఁదనే యుండుటచే వారిమీఁద మనస్సు పోవుటలేదు. అట్లైనచో నిష్టము నేను నిన్నంగీకరించిన వారి కందఱకు నా మీఁద కోపము రాదా? సవతి మత్సరము సాధింపరా యందువేమో! నా భార్య లట్టివారు గారు. సుగుణసంపత్తి గలవారు. అదిగాక వారి కందఱకు నీవే ప్రధాన కమ్ము. నీయధికారానుసారము నిన్ననుసరించి వారు వర్తింతురు.

క. సిరి నప్సరలు భజించెడి, కరణిఁ ద్రిలోకీప్రవరలు • కాంతా! యస్మ
త్తరుణులు నిన్ను భజింతురు, కరమును భయభక్తియుక్తిఁ•గనుఁగొం గనుమీ. ౫౩౬

అర్థములు. త్రిలోకీప్రవరలు = మూఁడులోకములందు శ్రేష్ఠురాండ్రు, అప్సరలు = అప్సరసలు. అస్మత్తరుణులు = నా స్త్రీలు.

తాత్పర్యము.

శ్రీ మహాలక్ష్మిని మూఁడు లోకములందు శ్రేష్ఠురాండ్రగు నప్సరస లేవిధముగ భయభక్తులతో సేవింతురో యా ప్రకారమే నా యొఁడునా రందఱు నిన్ను భయభక్తులతో సేవింతురు.

క. చేకొను మలకాపురిఁ గల, ప్రాకటరత్నములు ధనము • బద్మదళాక్షీ
లోకంబునఁ గల్గు నమూల్యాకల్పంబులను నన్ను • నాదర మారన్. ౫౩౭

అర్థములు. అమూల్య+ఆకల్పంబులు=వెలలేని యాభరణములు.

తాత్పర్యము.

కుబేరుని పుర మగు నలకాపురియందుఁ గల నిధులలో నుండు రత్నము లన్నియు నీవే తీసికొనుము. అవిగాక లోకమునఁగల వెలలేని యాభరణములను గ్రహింపుము. నన్ను ననుగ్రహింపుము.

క. తపముననో బలమునవో, విపులపరాక్రమములనో • విత్తమునందో
విపుల సుకీర్తినో కాంతినో, చపలాక్షీ! రామవిభుఁడు•సరియగు నాతోన్. ౫౩౮

తాత్పర్యము.

తపమునందో, బలమునందో, విస్తార పరాక్రమమందో, ధనమునందో, లోకమున మంచికీర్తియందో రాముఁడు నాతో సమానుఁ డగునా!

మ. లలనా! కోరినరీతిఁ గ్రీడలను దే•లన్ రాదె, పానం బదే,
కలభోగంబులఁ బొందుమీ, సుఖగతిం • గళ్యాణీ! విత్తంబులో
యిలయా సొమ్ములు గోరి నాపయిఁ గృపా•దృష్టుల్ ప్రసారించినన్
చెలి! నిరుడ్డము పెల్లరున్ సుఖులుగాఁ • జింతింపు కాంతామణీ. ౫౩౯

తాత్పర్యము.

సీతా! నీ యిష్టమువచ్చినట్లు మనసారఁ గ్రీడింపరాదా! త్రాగరాదా! భోగము

లన్ని యనుభవింపరాదా! నీకుఁ గావలసిన ధనమో, భూషణమో నీ కేది కోరిన నిచ్చె దనే. నాపై నీవు దయార్ద్ర దృష్టులు వ్యాపింపఁజేసితి వేని నీవే కాదు, నీకుఁ గావలసిన వారు బంధువు లందఱు సుఖపడుదు రని నమ్ముము.

మణిమంజరి. మసలకు కనకసు • మండన! కుంజ
ద్భసలవిసరములు • భాసిలు వేలా
కుసుమితతరుగణ • కుంజములందున్
బసమెయి మెలఁగుము • భామిని నాతోన్. ౫౮౦

అర్థములు. కనకసుమండన = బంగారుమయము లైన మంచి యాభరణములు గలదాన, కుంజత్ = ధ్వనించు, భసల విసరములు = తుమ్మెదల గుంపులు, భాసిలు = ప్రకాశించు, వేలా = సముద్రతీరమందలి, కుసుమిత = పూచిన, తరుగణ = చెట్ల సమూహముల, కుంజములందు = పొదలయందు.

తా త్ప ర్య ము.

భామిని! నీవు ఆలస్యము చేయకుము. బంగారుసొమ్ములు గలదానా! ఝుంకారములు చేయు తుమ్మెదల గుంపులుగల సముద్రతీరమందలి పూలచెట్ల పొదలందు నాతో సంతోషముగా విహరింపుము. మణిమంజరి వృత్తమునకు, న న స స గ గణములు, తొమ్మిదింట యతి.

—• ౨౧-వ సర్గము. సీతాదేవి రావణునకు బుద్ధి చెప్పుట. •—

చ. అనుచు దశాస్యవాక్యముల • నాథరణీశ్వర యాలకించి దు
ర్మన యయి వేపమాన యయి • మానక సాధ్వి పతిం దలంచుచున్
గనుఁగవ నశ్రువు ల్దొరఁగఁ • గా విలపించుచు దీననాదయై
యనెను గడ్డిపోఁచ తన • కడ్డము పెట్టి శుచిస్మితాస్య తాన్. ౫౮౧

అర్థములు. దుర్మన=వ్యసనముతోఁ గూడిన మనస్సు గలది, ఆలకించి=విని, వేపమాన = వణఁకు చున్నది, సాధ్వి=పతివ్రత, అశ్రువుల్ = కన్నీళ్లు, దొరఁగన్ = కారఁగా, దీననాదయై = దుఃఖముతోఁ గూడిన ధ్వనిగలది, ఏడుపు గొంతుతో, శుచిస్మితాస్య = పరిశుద్ధమైన చిఱునవ్వుతోఁ గూడిన ముఖముగలది. దుర్మన=పతి నెడఁబాసి యుండవలసి వచ్చెఁగదా, దుష్టుఁడగు వీనిచేఁ బతివ్రతలు వినరాని మాటలు వినవలసి వచ్చెఁగదా యని వ్యసనము.

వేపమాన = అబల—అసహాయ యగుటచే వీఁడు తొందరపడి తాఁకు నేమో యను భయముచే వణఁకెను.

సాధ్వి = సాధుత్వము గలది. కావున వాని నిగ్రహింపఁ గలిగియు సహించెను.

పతిం దలంచుచున్ = పతివ్రతలకు భర్తయే దైవము కావునఁ దక్కినవా రావత్కాలంబుల దైవమును స్మరించునట్లామె పతిం దలంచెను. పాలించువాఁడు గదా పతి.

అప్రాప్యత్ దారంగమాన్ = తెన్ను నా దేహమును జేయ జాలఁ డను ధైర్యము గలది కావునఁ దనకై యోచించినదికాదు. తన వలన భర్తకు దుఃఖము వచ్చెఁగదా యనియుఁ, దనవలన వీఁడు సమూలము నాశమై పోవ నున్నాఁడే, చెప్పినను వినఁడే యని రావణు నిమిత్తమైయు కన్నీరు గార్చెను.

గడ్డిపోఁచ తన కడ్డము నిల్పి.

౧. వీఁడు దుష్టభావము గలవాఁ డైనను ప్రభువు, క్షత్రియుఁడు. ఇట్టి వీఁడు తన కొఱకు వచ్చినపుడు 'ఆసనం చాన్న ముదకం దేయమ్' అతిథివంటివాఁడే. అతిథికి ఆసనమో, అన్నమో, నీళ్లో యథాశక్తి యియ్యవలయు నని శాస్త్రవాక్యము గలదు. కావునఁ దనకు లభించిన యాతృణము వైచెను.

౨. రావణుఁడు వచ్చి సమీపమందుఁ గూర్చుండుటచే దుష్టులతో సంపక్తిఁ గూర్చుండరాదు గావున పంక్తిభేదము గలిగింప 'స్తంభేన సలిలేన వా పంక్తిభేదో౽భిజాయతే' స్తంభముగాని, నీళ్ళుగాని యొక్కడైన నడ్డముండిన పంక్తిభేద మగును గావున నిరువురకు నడుమఁ దృణము వైచెను.

౩. స్త్రీ పరపురుషునిఁ బ్రత్యక్షముగఁ జూడరాదు. మాటలాడరాదు. 'న పర ముఖ నిరీక్షణం నాపి సంభాషణ'మ్మన్న నీతి ననుసరించి ప్రత్యక్ష సంభాషణము నివారింపఁ దృణ మడ్డము వైచెను.

౪. 'తృణ మివ లఘు మేనే' నిన్ను నేను తృణముగా నెంచుచున్నాను. అన్నట్లు నీ వీ తృణముతో సమానము. ఈ తృణము నన్నేమి చేయఁగలదో నీవు చేయఁగలిగిన దంతయే యని సూచింపఁ దృణము వైచెను.

౫. నీకు జ్ఞానములేదు 'జ్ఞానేన హీనాః పశుభి స్సమానాః' యున్నట్లు నీవు పశువుతో సమానము. నీకు భోగ్యవస్తు వీ గడ్డియే. నేను గాదని తెలుప గడ్డిపోఁచ యడ్డము వైచెను.

౬. అలకాపురిఁ గల, మఱియు లోకమునఁ గల రత్నాభరణము లిచ్చెద నంటివే, అవి, నీ యైశ్వర్యమంతయు నీ తృణముతో సమాన మని తెలుప గడ్డిపోచ యడ్డమువేసెను.

౭. ఎంతటి శత్రువైనను గడ్డిపోఁచ నోటఁ గరచుకొన్నవాని వీరులు చంపరు. కావున నీవు బ్రదుకఁ గోరెదవేని దీనిని నోటఁ గఱచుకొని రాముని యొద్దకుఁ బొమ్ము. నిన్ను రక్షించును. లేకుండిన నిన్నుఁ జంపుట నిజము.

౮. నన్ను నీవు బాధించితివా హిరణ్యకశిపునిచే బాధపడు ప్రహ్లాదుని రక్షింప స్తంభమునుండి నృసింహమూర్తి యుద్భవించినట్లు ఈ తృణము నందు రామమూర్తి యుదయించి నిన్నిచ్చటనే చంపును.

౯. తృణము విఱిచివేసిన యొడల సత్యము తప్పనని ప్రమాణము చేసి నట్లగును.

కావున నన్ను నీవు బాధించుటచే రాములక్ష్మణులు నీలంకను భస్మీభూతము చేయుదు రని ప్రమాణము చేసి చెప్పెద నని భావము.

౧౦. నా యవయవములందు నీ దృష్టి నిలిచినయెడల నని యుంటివి. నీదృష్టులు మఱలక యుంతటితో హానిము లగునట్లు వామనుఁడు శుక్రాచార్యుని కన్నులు దర్భతోఁ బొడిచినట్లు దీనితోఁ బొడిచెదను.

౧౧. రామచంద్రమూర్తి నన్ను స్పృశించిన కాకాసురు నెట్లు దర్భచే కన్నులు పొడిచి పంపెనో యట్లులే నీ కన్నులు పొడిచెదను.

౧౨. నీవు రాముని గెలిచెద నంటివి. రామచంద్రమూర్తి విడిచిన యా దర్భను బ్రహ్మరుద్రేంద్రాదులును మఱలింపఁ లేకపోయిరి. అట్టి వానిని నీ వేమి గెలువఁగలవు ?

౧౩. ఈ తృణమును త్రుంచునట్లు నీ తలను త్రుంచెదను జుమీ యని సూచింప తృణము త్రుంచివైచెను.

పతివ్రతల కోపదృష్టి కోపింపఁ జేసినవారిని దహించును. దమయంతి యొకక వానిని దహించెను. గాంధారి చూపు ధర్మరాజు పదనఖంబులపైఁ బడ నవి కమ లెను. (భార. స్త్రీ. ౧-౧౭౬)

అట్లులే సీతను దన దృష్టిపడినా భస్మ మగును. అట్లు వానిని మాత్రము భస్మము చేయుట యామెకు ధర్మ్యముగాదు. సీతను పరస్త్రీహరణము తన కులధర్మ మని చెప్పెను. అట్టి కులమునే నిర్మూలింపవలెను. గాని యొకని నిగ్రహించిన లాభ మేమి? అని తలఁచి వానిని దగ్ధునిఁ గాకుండుటకై తృణము వైచెను.

౧౪. నీవు నాకుఁ గోపము వచ్చునట్లు చేసితివేని నా కోపాగ్నికి నీ వీ తృణ ప్రాయుడ వనుమా. కావున నాకుఁ గోపమువచ్చునట్లు చేయకుము.

శుచిస్మితాస్య - ఇది నవ్వవలసిన సమయముకాదే ఏల నవ్వెను ?

౧. తక్కిన స్త్రీలు నవ్వుచున్నప్పు డుండు ముఖకాంతి యామె దుఃఖించు చున్న నుండును. అది స్వభావసిద్ధము. ఇప్పుడే యుల్లసించునది, సంతోషమున నుండు నవ్వు దోఁచుచుండునో.

౨. పాము తన్ను మ్రింగుచుండఁ దాను గండుచీమను మ్రింగబోవు కప్పవలెఁ దన్ను మృత్యుదేవత వాత వేసికొనుచుండుట యెఱుఁగలేక నన్నాశించున్నాఁడే, వీఁ డెంత మూఢుఁడని నవ్వెను.'పుట్టరాని దుఃఖమువచ్చిన నవ్వ్వ-మని నవ్వ' మనినామెత.

౩. క. గజ మంటినట్ల యుసుచున్
భుజగము మూర్కొనినయట్ల • పొరిగొను ధరణీ
భుజుఁడు నగినట్ల చంపున్
గుజనుఁడు మన్నించునట్ల • గొను ప్రాణంబుల్ ॥పంచ॥

అని యుండుటచే రాజపుత్రి రాజునీతి యెఱిఁగినది కావున నట్లు నవ్వెను.

౪. రాముని బలపరాక్రమంబుల నాయాతనుగాఁ దెలిసికొనితివే, ఆయన యాశ్రితవత్సలుఁడు గదా నన్నుఁ జెప్పితివి. అట్టి వానికి పందవు చాటున నాఁడు వారి ముందర బంధములు పలికెదవే యని నవ్వెను

౫. ఈ నవ్వు సామాన్యమైన నవ్వుగాదు. శుచిస్మిత = అగ్నిహోత్రము వంటి నవ్వు, అదియే వానిని నాశము చేయఁగలదు; శుచి=అగ్ని.

క. నాపయిఁ జిత్తముఁ జేర్పకు, నిజకాంతలయందు మనసు • నిలుపుము నను నీ
వీ పగిది వేఁడ ఫలమా, పాపాత్ములు ముక్తిఁ గోరు•పగిదని ధూర్తా! ౫౮౨

తాత్పర్యము.

అందని పండుకై యఱ్ఱులు సాఁచినట్లు నాపై నీవు మన స్సుంచ వలదు. పాపాత్ములకు ముక్తి లభింపనట్లు నేను నీకు లభించు దానఁగాను. నీ వెంత వేఁడినను ప్రయోజనము లేదు. అట్లైన నన్నేమి చేయు మనెదవా! నామీఁద నుంచిన మనస్సును మరల వెనుకకుఁ దీసికొని నీ భార్యల యం దుంపుము. నా మీఁద మనస్సుంచిన నీ కెట్టి కీడు కలుగునో నీ భార్యలమీఁద నీవు మన స్సుంపనేని యంత కీడు గలదు. "పరిభూతవిమర్శా చే ద్భార్యా భర్తా వినశ్యతి" నిష్కారణముగ భార్య నవమానించుటచే నామె దుఃఖించెనేని భర్త నశించును, అని కలదు గదా. కావున నీవు వారి నుపేక్షింపకుము, న న్నపేక్షింపకుము.

ఉ. పుట్టితిఁ బుణ్యవంశమునఁ • బూజ్యతరాన్వయ మేను మెట్టితిం
బట్టితి నేకపత్నినియ•మంబును నిట్లు రహించి పాపమున్
గట్టుకొనంగ నేర్తునె య•కార్య మొకండు ఘటించి! నేల యీ
వట్టివి విప్రలాపములు • వాఁగెదు మూర్ఖుఁడ వౌదు రాక్షసా! ౫౮౩

అర్థములు. మెట్టితిన్ = ప్రవేశించితి. ఏకపత్నినియమంబు = పాతివ్రత్య వ్రతము, విప్రలాపములు=విరోధపు మాటలు, వాఁగెదు=వదరెదవు.

తాత్పర్యము.

ఓరి రాక్షసుఁడా! నేను పుణ్యాత్ముని వంశమునఁ బుట్టితిని. అంతకంటెఁ బూజ్యులైన వారియింటఁ బ్రవేశించితిని. పతివ్రతానియమమును గ్రహించితిని. ఇట్టి నేను చేయరాని చెడు కార్యము చేయఁగలనా? చేసితి నేని నేను పుట్టుటయే కాక యీ రెండు వంశముల వారిని నరకముల పాలు సేయనా? ఇవంతియు నాలోచింపక యేల శాస్త్రవిరుద్ధము, లోకవిరుద్ధము, ఆత్మవిరుద్ధము నగు మాట లూరక వదరెదవు.

చ. అని యెడపాటుగా మజిలి • యా జనకాత్మజ వెండియిట్లు నో
దనుజుఁడ! నేను సాధ్విఁ, బర•దారను, నీ సతిఁ గాను, నీ మదిం
గను మిఁక సాధుధర్మము ప్ర•కారము, సాధులమార్గ మూనుమీ,
పనిగాని తేరతేర కిటు • పాపము నీ వొడిగట్ట నేటికిన్ ! ౫౮౪

కావున జారత్వ మెంత కీడో తెలిసికొని బుద్ధిగలవాఁడవై ప్రవర్తింపుము.

శా. లేరా పెద్దలు నీకు బుద్ధిఁ దెలుపన్ ! లేకుందురా యీ పురిన్
వారిన్ డాయవొ ధర్మమార్గములు నేర్వన్ ! నీ దురాచారముల్
మారీభూతసుపుణ్యవత్క్రియలు సాధువ్రాతదూరస్థుఁగా
నోరీ ! తెల్పెడిఁ, గాక యున్న విపరీతోక్తుల్ వచం బల్కెదే ! ౫౮౭

అర్థములు, మారీభూత=మారముగాఁ జేయఁబడిన, సుపుణ్యవత్క్రియలు= మంచి పుణ్యము నిచ్చు కార్యములు, సాధువ్రాత దూరస్థుఁగాన్ = సజ్జనులకు దూర మందుండు వానిఁగా, విపరీతోక్తుల్ = విరుద్ధపు మాటలు.

తాత్పర్యము.

నీవు చేయరాని పని చేయఁ బూనినపుడు నీ మేలు కోరి నీ కిది తగదు, హాని కరము అని చెప్పుడు వారింత పెద్దపట్టణమం దొకరైన లేరా? విభీషణాదుల వంటి వారు లేకుందురా ! ఉన్నారు. ఉండిన నేమి లాభము ? ఏది ధర్మ, మేది యధర్మ మని తెలిసికొనుటకు నీవు వారియొద్దకు పోవుచున్నావా ! వారిని నీవు సేవించు చున్నావా? లేదు. "తద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం, జ్ఞానిన స్తత్త్వదర్శినః" యన్నట్లు నీవు పోయి నమస్కరించి ప్రశ్నించినఁగదా ధర్మ తత్త్వ మెఱిఁగిన పెద్దలు నీకు జ్ఞాన ముపదేశింతురు. నీ వట్లడిగిన వాఁడవు కావు. వలన నీ దుష్టప్రవర్తనము, పుణ్యములు గాని కార్యములు చేయుట మూలఁగా సాధువులకు నీకుఁ జాల దూర మని తెలియుచున్నది. అటుగాకున్న నీ విట్లు విపరీతపు మాటలు మాటలాడనే యాడవు.

క. కాలంబు దీఱె రాక్షస, జాలంబుల కీవు వినవొ సాధుల బోధల్ ?
బాలిశ! మిథ్యాస్నేహాని, లోలున్ నిను నమ్మి వారు లోఁగరె చెట్టన్ ! ౫౮౮

తాత్పర్యము.

నీవై యడుగకున్నను, నీమేలు గోరువారు నీకు హిత ముపదేశించియుందురు. కాని వారి మాటలు నీవు విన్న వాఁడవు కావు. నీ రాక్షసులందఱు నీవలనఁ జావవలసిన కాలము వచ్చినది. కావున నింతవఱకు నీవు గొప్పవాఁడ వని నీ యాశ్రయమున మేలు పొందెద మని తలఁచి రాక్షసు లందఱు నీయందు స్నేహభావము గలవారై యున్నారు. వారు నీ మేలుఁగోరునట్లు వారి మేలు నీవు కోరువాఁడవు కావు. నీ స్నేహ మసత్యము. నీవు చెడుటయే కాక వారందఱు చెడునట్టి పనిని చేయుచున్నావు.

మిథ్యాస్నేహ మనఁగా స్నేహమభావ మని యర్థము కాదు. వారియందు నీకుఁ గల స్నేహభావమే ఫల మియ్యవలయునో యూ ఫల మిచ్చుట లేదు. స్నేహము వలని ఫల ముపకారము. అది నీ వలనఁ గలుగుటకు మారు అపకారము గలుగ నున్నది. కావున నీ స్నేహము మిథ్యాస్నేహము.

చ. అనయరతాత్ముఁ డౌచు నకృ•తాత్ముఁడునైన నృపాలపాలన
ట్టనములు రాష్ట్రముల్ సిరి యు•నంగుడు. తద్గతి రత్నపూర్ణయై
గొన బరు లంక యుం డిటను • గూలెడు నిక్కము శీఘ్రకాలమం
దున యసురేంద్ర ! నీ యొకని • దోషమునం బలుకారాట లేటికిన్. ౧౪౮

అర్థములు. అనయరతాత్ముఁడు = చెడునడవడియందు నాసక్తిగల మనస్సు గలవాఁడు, అకృతాత్ముఁడు = పెద్దలచే శిక్షింపఁబడని స్వభావము, మనస్సు గల వాఁడు, నృపాలపాలు = నీచరాజునొక్క-, తద్గతిన్ = ఆ విధముగా,

తాత్పర్యము.

ఓరీ! పుణ్యాత్ములచేఁ జక్కదిద్దఁబడని మనస్సు, స్వభావముగలవాఁ డగుటచే చెడు నడవడియందుఁ బ్రీతిగల నీచరాజు కారణముగ వాని పట్టణములు, రాజ్యములు, సంపద నాశము లగును. ఆ విధముగనే నీ వొకఁడు చేయు పాపము వలన రత్నములతో నిండి యున్నదైన లంక యుంతయు శీఘ్రకాలమందే నిజముగ నాశము కాఁగలదు. ఎట్లనఁగా ! ఓడ నడపువాఁడు మత్తుఁడై యోడను సుడిగుండము లోనికి చేర్చిన వాఁడు చెడుటయే కాక వానిని నమ్మి యోడలోఁ గూర్చుండిన వారందరు చెడుదురు గదా.

ఉ. దూరపుఁజూపు లేక యెటు • దోచిన నట్లు విధైనఁ జేయుచున్
గూరిన పాపకార్యముల•కుం మది యిచ్చి చరించు నా యప
స్మారి స్వకీయకృత్యములఁ • జావఁగ లోకము లెల్ల సంతసం
బారఁగఁ బందుగుల్ సలుపు • పోయిగఁ గన్నుల మిగుల వాతులన్. ౧౪౦

అర్థములు. అపస్మారి = ఉన్మత్తుఁడు, స్వకీయకృత్యములన్ = తాను చేసిన కార్యములచే, దూరపుఁజూపు = దూరాలోచనము.

తాత్పర్యము.

దూరాలోచనము లేక యేవేళ కేది తోఁచునో దానిని ధర్మాధర్మవిచారము లేక యే పాపకార్యమునందైన మనస్సు పోనిచ్చు నున్మత్తుఁడు వాఁడు చేసిన పాప కార్యములచే వాఁడు చావఁగా లోకు లందఱు సంతోషముతోఁ బండుగలు చేసికొని నిర్భయముగ, సుఖముగ శాత్రులందఱు గన్నార నిద్రపోదురు.

ఉ. నిక్కపు వంచకుండ నగు•ని న్నొక స్నేహితుఁ డంచు నమ్మ నే
దిక్కటి పోవువారు నినుఁ • దిట్టగ నీ చెడుకాల చిక్కె నీ
చిక్కుల నైన తంత్రములఁ • జేయఁగ నేర యటంచు సంతసం
బెక్కఁగ, నేలా చెడెద • నీ గతి నింకను నందు నింకలున్ ! ౧౪౧

తాత్పర్యము.

స్నేహితునివలె నటించుచుఁ దనకుఁ గీడు గలిగించు నిజమైన మోసగాఁడ వగు నిన్ను నీ చిత్తవృత్తి తెలియనివారు, నిన్నుఁ దమకు మంచిస్నేహితుఁడ వని నమ్మి

రాఘవత్వే భవే త్సీతా, రుక్మిణీ కృష్ణజన్మని
అన్యేషు చావతారేషు, విష్ణో రేషానపాయినీ
దేవత్వే దేవదేహేయం, మనుష్యత్వే చ మానుషీ
విష్ణో ర్దేహానురూపాం వై, కరోత్యేషాత్మన స్తనుం.

ఎప్పుడు జగత్స్వామి జనార్దనుఁ డవతార మెత్తునో యప్పు డెల్ల శ్రీదేవి యాయనకు సహాయురాలై యుండును. రామావతారమున సీతాదేవిగను, కృష్ణావతారమున రుక్మిణిగను, ఇతరావతారములందు నిట్లే విష్ణువును విడిచి యుండదు. ఆయన దేవతలం దవతరించినా తాను దేవత్వమును, మనుష్యులం దవతరించిన మనుష్య స్త్రీగను నగును. విష్ణుదేహమున కనురూపమైన దేహమును దానుధరించును.

అనన్యయనఁగా రాయి సీళ్ళవలె, చీఁటి వెలుఁగులవలె నన్యముగాక సూర్యుఁడు—ఎండ; చంద్రుఁడు—వెన్నెల, రత్నము, కాంతివలె, సముద్రము—అల, శక్తి—శక్తుఁడు – ఇవి మాటలకు వేఱుగాఁ గోఁచినను వేఱు గానివి. గుణము – గుణి, విశేషణము – విశేష్యము వీనివలె నవినాభావసంబంధము–గలది యనన్యము. ఇట్టులే జీవాత్మ పరమాత్మల కనన్యత్వ మెఱుఁగునది. జీవాత్మ విశేషణము (ఎండ) పరమాత్మ విశేష్యము (సూర్యుఁడు) "మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః" అన్నట్లు పరమాత్మ యంశమే జీవాత్మ. కావున విశేషణ విశేష్య సంబంధము;పరమాత్మకంటె నే నన్యముగాను, అని జీవాత్మ యనుకొనుటయే యనన్యత్వ బోధ మని శంకరమతము గాని జీవాత్మయే పరమాత్మ యనితలఁచుట కాదు. అపృథక్సిద్ధము."ప్రకాశాదివత్తు నైవం పరః" – బ్ర. సూ. 3. 2 ౨౮. ఈ యర్థమునే బోధించుచున్నది. అనఁగా కాంత్యాదికమువలెనే జీవుఁడు బ్రహ్మాంశము. ప్రకాశాదు లగ్న్యాదుల యంశముగునట్లు జీవుఁడును పరమాత్మ యంశము. ఈ యర్థమునే రామచంద్రమూర్తియు ముందు చెప్పఁగలఁడు. కావున ముముక్షు వగు బద్ధజీవుఁడు సీతాదేవి, రామచంద్రమూర్తి పట్ల నెట్టి యభిప్రాయము గలదై, యెట్లు ప్రవర్తించి, లంకనుండి ముక్తురా లయ్యెనో యట్లే పరమాత్మ విషయమున వర్తించి ముక్తుఁడు కావలయును. సీతాదేవి నేనే రాముఁ డని చెప్పలే దనుటను గమనింపవలెను. అట్టులే రాముఁడు తానే సీత యని చెప్పలేదు.

తే. ఆ జగన్నాథు సత్కృతం • బైన భుజము, దిండుగా సుఖ మందెనీ • దేవి యయ్యు
నసురుఁడా! పేరులేని పెద్దమ్మ నొకనిఁ, గరముచే నంటుకొనె నాదు • కాంతుఁ బాసి.

అర్థములు. ఆ = ఆ విధముగఁ బ్రసిద్ధికెక్కిన, జగత్ + నాథు = బ్రహ్మ మొదలు స్తంబపర్యంతము చేతనాచేతనముల కన్నిటికిని, నాథుఁడు = రక్షకుఁడు అధిపతి యగు వానియొక్క, సత్కృతంబు = పూజింపఁబడినది, దేవిని = ప్రియురాల నగు భార్యనై యాయనతోడ సమానమైన లోకపూజ్యత గల రాణినై యయ్యు, పేరులేని పెద్దమ్మ = ఇది లోకోక్తి, కీర్తిప్రతిష్ఠలు లేనివానిని, ఒకనిన్ = కశ్చిత్తు గానిని, ఆయనకు దాసుఁడుగా నుండఁదగిన యోగ్యత లేని వానిని.

తాత్పర్యము.

సర్వలోక ప్రసిద్ధుఁడై, చరాచరకోటికి బ్రహ్మాదులు మొదలు స్తంబపర్యంతమున కంతకు నాథుఁడైన నా కాంతుని యొక్క పూజ్యమైన భుజమును తలదిండుగా చేసికొని పండుకొను పతిని దేవినైన నేను మీరు ప్రతిష్ఠలేని యనాథుని నొకనిఁ జేతిపై నైనఁ జాచుదునా ?

ఉ. సాంగము వేదముం జదివి • సత్యము, శీలముఁ గల్గి సాధుస
త్సంగతిఁ జేతి జ్ఞాని యగు • బ్రహ్మవిబుధేశున కాత్మవిద్య నా
సంగుగ రామభద్రునకు • జ్యాపతికిన్ తగు భార్య నేను నీ
యంగముఁ గాల నేనియును • నంటుదునా యిది యేమి భ్రాంతిరా ! ౫౫౫౪

అర్థములు. సాంగము = అంగములతోఁ గూడినది, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము. ఈ యాఱును వేదాంగములు. సాధుసత్సంగతి = సాధువు లగు సత్పురుషుల సాంగత్యము, జ్ఞాని = జీవాత్మ పరమాత్మల సంబంధము తెలిసినవాఁడు, బ్రహ్మవిబుధేశునకు= బ్రాహ్మణ శ్రేష్ఠునకు, ఆత్మవిద్య= యోగవిద్య, అంగుగన్= అన్నివిధముల చక్కఁగ, జ్యాపతికి = భూపతికి, తగు= యోగ్యురాలనైన, 'హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ' యని శ్రుతి చెప్పినట్లు భూదేవియు, లక్ష్మీదేవియు భగవంతుని భార్యలు, అంగము = దేహము, అంగముగాల యనుట యందు తిట్టుకూడ స్ఫురించెడిని.

సాంగము వేదముం జదివి=ఆఱుఅంగములతోడ వేదముఁ జదువఁగానే లాభము లేదు, గాడిద గంధపొడిమూట మోసినట్లే. సత్యము, శీలము గలవాఁడై యుండవలెను. నీవు వేదములు చదివితివి, ఏమి లాభము! సత్యశీలములు లేవు, ఇచ్చట నీ శ్లోకము స్మరింప తగు. హనుమంతుఁడు మొదట రామచంద్రమూర్తి యొద్దకుఁ బోయినప్పుడు ఆయన రాక్షసుల బలాబలములు, ఆచారవ్యవహారములు ప్రశ్నింపఁగా,

'అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ రాక్షసానాం గృహే గృహే' యనెను. ఇది వినఁగానే అగ్నిహోత్రములు, వేదములు గలవారిని జయింప సాధ్యముగాదే, అట్టి వారిని నే నెట్లు చంపఁగలను ? అని యాయన ముఖము వెల్లఁబోయెను. అది తెలిసికొని హనుమంతుఁడు 'దయా సత్యంచ శౌచంచ రాక్షసానాం నవిద్యతే,' దయ, సత్యము, శౌచము అనునవి మచ్చుకైనా లేవుఁగదా అనెను. అప్పుడు రామునకు ధైర్యము వచ్చెను.

అంతమాత్రమే కాదు. సాధుసాంగత్య ముండవలెను. అది లేనిచో తక్కిన వన్నియు ఫలవంతములు గావు.

''సంత స్సంగస్య భేషజమ్'' ''నాసత్యః కించి దాచరేత్'' ''సంసర్గజా దోష గుణా భవంతి'' ''త్రిజగతి సజ్జన సంగతి రేకా భవతి భవార్ణవతరణే నౌకా'' ''సత్సంగత్వే నిస్సంగత్వమ్'' ''సత్సంగాన్నైవ నిస్పృహాః'' ''త్యజదుర్జన సంసర్గం భజ సాధు

వ్యాఖ్యాన మని యీ వ్యాఖ్యానమున ముందు వ్రాయఁబడెను. ఈ రామాయణ ముందుఁ గల విషయములే భారత భాగవతములందుఁ బెంచి వ్రాయఁ బడినవి. ఈ వ్యాఖ్యాతయొక్క యీ యభిప్రాయమును బృహద్ధర్మ పురాణమందలి యీ యను వాదములు బలపఱచు చున్నవి.

రామాయణం మహాకావ్య మాదౌ వాల్మీకినా కృతమ్
తన్మూలం సర్వకావ్యానా మితిహాస పురాణయోః
సంహితానాంచ సర్వాసాం మూలం రామాయణం మతమ్
తదేవాదర్శ మారాధ్యం వేదవ్యాసో హరేఃకలా
చక్రే మహాభారతాఖ్య మితిహాసం పురాతనమ్
కార్యాకార్య నిర్ణయో౽త్ర స్మృతిర్వై ధర్మసంహితా
ఇతిహాసాదివాక్యంతు తన్నిదర్శన సాధకమ్.

విధి రువాచ:—

యత్ త్వం వేదార్థవక్తా స్యాః కావ్యరూపేణ సర్వశః
అహం సృష్టికరో బ్రహ్మ న్నత్ర లీలాకరో హరిః
తద్వర్ణనస్య కర్తా త్వం సృష్టిరత్నాకరో భవ
లోకానాం ధర్మరూపైవ విష్ణోర్లీలా మలాపహా
త్వయా సా వర్ణితా లోకే పరో ధర్మ స్థిరో భవేత్
త్వంచ త్రికాలవృత్తిజ్ఞః సత్యవాదీ ప్రతిష్ఠితః
నాహం త్వత్తః పృథక్ భూతః కవి రన్యః ప్రజాపతిః
కవి ర్బ్రహ్మా కవి ర్విష్ణుః కవి రేవ స్వయం శివః
కవిర్వై ధర్మవక్తాచ కవిః సర్వరసైకవిత్
త్వంతు రామచరిత్రాణి మునే భావీని వర్ణయ
తత్తు రామాయణం నామ మహాకావ్యం భవిష్యతి
వర్ణయిష్యసి యద్యత్ త్వం తత్తు విష్ణుః కరిష్యతి
విష్ణోః కీర్తి భవత్ కావ్యం స్థాస్య త్యాచంద్రతారకమ్.

దేవ్యువాచ:—

రామాయణం మహాకావ్యం కృతం వాల్మీకినా స్వయమ్
తత్ర రామచరిత్రస్య వ్యపదేశేన సర్వశః
సర్వే ధర్మాః సముద్దిష్టా వర్ణాశ్రమ విభాగశః
నానాదేశ చరిత్రాణి క్రతుమిత్రకథా అపి
ఇతిహాసస్వరూపేణ సర్వేధర్మా నిరూపితాః.

వాల్మీకి రువాచ:—

వేదః పరిణతో భూత్వా మహాభారతతాం గతః

స్త్రీశూద్ర ద్విజబంధూనాం వేదార్థ జ్ఞానహేతవే
భారతం కృతవాన్ పూర్వం దేవో నారాయణః స్వయమ్
భారతస్య విధానాయ త్వం నారాయణ నిర్మితః
రామాయణాచ్చ విస్తీర్ణం త్వం మహాభారతంకురు
రామాయణ పరీపాట్యా త్వం మహాభారతంకురు
పరమాత్మ స్వరూపస్య సీతారామస్య చేష్టితమ్
వర్ణితం చైకరూపస్య తచ్ఛరీర విశేషవత్
స ఏవ దేవో భగవాన్ కృష్ణః కమలలోచనః
జీవ ద్వితీయ శ్చిక్రీడ భూభారక్షయహేతవే
జీవాత్మ పరమాత్మానౌ నరనారాయణౌ ప్రభో
నారాయణో వాసుదేవో నరశ్చైవార్జునాహ్వయః
నరనారాయణమయం తన్మహాభారతం విదుః
ఏకం రామాయణమయం కృతం రామాయణం మయా
రామాయణే భారతేచ విశేషోఽయ ముదాహృతః.

బృహద్ధర్మపురాణమ్.

శ్రీకృష్ణోపి పునర్దేవి వ్యాసరూపధరో భువి
మానవానాం హితార్థాయ కావ్యాద్రామాయణాత్ స్వతః
భాగా ద్భారత వర్షాంతర్గతాచ్చ వివిధాని హి
పృథక్ పృథక్ సప్తదశ పురాణాని కరిష్యతి
సర్వాణి భారతాద్యైశ్చ యదా శాంతిం నగచ్ఛతి
అష్టాదశ సహస్రంహి శ్రీమద్భాగవతాభిధమ్
కరిష్య త్యష్టాదశమం రమ్యం జనమనోహరమ్
యత్కించి ద్గిరిజే భూమ్యాం కీర్త్యతే వై కథానకమ్
రామాయణాంశజం విద్ధి శ్లోకమాత్ర మపీహ యత్.

ఆనందరామాయణమ్.

శ్రీమద్రామాయణమునకు భారత భాగవతము లెట్లు వ్యాఖ్యానములో రామాయణములోని 'ఏతం కవీనా మాధారమ్' భవిష్యత్కృతుల కిది యాధారము అను వాక్యమునకు నిట్టివి యనువాదములు వ్యాఖ్యానములై యున్నవి వాని సారాంశ మేమన:—

రామాయణము మహాకావ్యము. అది యాదియందు వాల్మీకిచే రచింపఁబడెను. అది సర్వకావ్యములకు నితిహాసపురాణములకు నాదిమూలము. సమస్తసంహితలకు మూలము రామాయణము. దాని నాధారముచేసికొని విష్ణుకళయగు వేదవ్యాసుఁడు మహాభారతము మున్నగు పురాణేతిహాసములు రచించెను.

బ్రహ్మవాక్యము. నీవు కావ్యరూపమున వేదార్థవక్త వైతివో నే నట్టి సృష్టికర్తను. అందు లీలాకరుఁడు విష్ణువు. ఆ విష్ణువుయొక్క లీలలు వర్ణించి సృష్టి రక్షింపుము. ధర్మరూపయగు విష్ణులీల పాపముల హరించును. నీవు దానిని వర్ణించితేని లోకమున ధర్మము స్థిరపడును. నీవు త్రికాలవేదివి. సత్యవాదివి. నాకంటె నీవు భిన్నుఁడవు కావు. కవి యనగా వేదోక్త ప్రజాపతియే. కవియు బ్రహ్మ. కవియు విష్ణువు-కవియు శివుఁడు. ధర్మకర్త కవియు. సర్వరక్షకుఁడు కవియు. నీవు రామాయణమును భవిష్యము తోడ వర్ణింపుము. అది మహాకావ్యమగును. నీ వేమి వర్ణించెదవో దానిని విష్ణువు చేయును. విష్ణుకీర్తిగల నీ వాక్యము ఆచంద్రతారకముగ భూమియందు నిలుచును.

దేవీవాక్యము:—

రామాయణ మహాకావ్యము వాల్మీకిచే రచింపఁబడెను. రామచరిత్రమును నెపముగాఁ దీసికొని సమస్త వర్ణాశ్రమ ధర్మములు నానాదేశ చరిత్రములు శత్రుమిత్ర కథలు ఇతిహాస స్వరూపముగ సర్వధర్మములు నిరూపింపఁ బడెను.

వాల్మీకి వాక్యము:—

వేదము పరిణమించి భారతముగ నయ్యెను. స్త్రీలకు శూద్రులకు బ్రహ్మబంధువులకు వేదార్థజ్ఞానము కలుగుటకై (వీరికి వేదము చదువునధికారము లేమిని) భగవంతుఁడు నారాయణుఁడే పూర్వము భారతము రచించెను. భారత విధానార్థము నీవు నారాయణునిచే నిర్మింపఁబడితివి. రామాయణమున కంటె విస్తారముగ నీవు భారతమును చేయుము. రామాయణక్రమము ననుసరించి నీవు భారతము చేయుము. పరమాత్మ స్వరూపమైన సీతారామ చేష్టితము ఆయన శరీర విశేషము వలెనే యొక రూపముగ వర్ణింపఁ బడినది. ఆ భగవంతుఁడు కమలలోచనుఁడు, కృష్ణుఁడై భూభారము తొలగింపఁజేయ రెండవవాఁడగు జీవునితోఁ గ్రీడించెను. (రెండవవాఁడు జీవుఁడు అర్జునుఁడని యెఱుఁగవలెను.) నరనారాయణులు జీవాత్మ పరమాత్మలు. నారాయణుఁడు వాసుదేవుఁడు. నరుఁడు అర్జునుఁడు. ఆ మహాభారతము నరనారాయణ మయము, రామాయణము సీతామయముగా నేను చేసితిని. (ఇందు జీవకృత్యమున కంటెఁ బరమాత్మకృత్యము విశేష మని భావము.) రామాయణమునకు భారతమునకు ఇది భేదము. రామాయణమందు జీవాత్మను (సీతను) నెపముగా నుంచుకొని సర్వము తానే పరమాత్మ (రామచంద్రమూర్తి) చేసెను. భారతమందు జీవాత్మయగు అర్జునుచే సర్వము చేయించెను ఇది రెంటికి భేదము. వ్యాసరూపము ధరించి శ్రీకృష్ణుఁడను పేరు (కృష్ణశబ్దమునకు వ్యాసులనియు నర్థముగలదు) మానవుల హితముకొఱకు మఱల రామాయణ కావ్యమునకంటె భారముగ భరతవర్షమునఁ బదు నేను పురాణములను భారతమును చేయుచుండఁగ వ్యాసులు రచించియు శాంతిలేని వాఁడై పదునెనిమిదివేలగ్రంథము గల శ్రీమద్భాగవత మను పేరుగల పదునెనిమిదవ పురాణమును జనమనోహరమైన రమ్యమైన దానిని చేయఁగలఁడు.

పార్వతీ! లోకమునఁ గీర్తింపఁబడిన కథ యే కొంచెమైనను రామాయణాంశజ మనియే యెఱుంగుము. ఆనంద. రా.

రామాయణమున జీవకృత్యము సీతాదేవి చరిత్రము వలనను పరమాత్మ కృత్యము రాముని చరిత్రము వలనను దెలియవలెను. మనము జీవాత్మల (సీతాదేవి) ప్రవర్తనము దెలిసికొని యా ప్రకారము నడచి ముక్తులగుట యావశ్యకము. ఆ సీతాదేవి చరిత్రము విశేషించి సుందరకాండమునఁ గలదు. ఆ కారణముచేతనే యిది విశేషముగ నాదరణ పాత్రమై సుందరకాండ మను సార్థక నామధేయము వహించి యున్నది.

తాత్పర్యము.

ఇంద్రునకు శచీదేవి, వసిష్ఠున కరుంధతి, చంద్రునకు రోహిణి, చ్యవనునకు సుకన్య, సత్యవంతునకు సావిత్రి, కపిలునకు శ్రీమతి, అగస్త్యునకు లోపాముద్ర, సగరునకుఁ గేశిని, సౌదాసునకు మదయంతి, నలునకు దమయంతి యెట్లో రామచంద్రమూర్తికి నేనట్లులే, నే నాయన ననుభవించి కృతార్థురాల నగుదును.

క. జానకి యిటు పల్కిన విని, దానవకులనాథచోదితలు రాక్షసుల్
దీనాత్మను గర్కశవా, చానిష్ఠురబాణనిహతఁ జలిపిరి మిగులన్. ౬౧౩

అర్థములు. చోదితలు = ఆజ్ఞాపింపఁబడినవారు, దీనాత్మను = దుఃఖించుచున్న మనస్సుగలదానిని, కర్కశవాచా = కఠిన వాక్కులనెడు, నిష్ఠురబాణనిహతన్ = కఠినబాణములచేఁ గొట్టఁబడిన దానినిగ, రావణచోదితలు అనునది హేతుగర్భితము.

ఈ స్త్రీలు సీతను బాధించుట కేమి హేతు వనిన రావణు నాజ్ఞయే కాని వారికి ద్వేషబుద్ధి గలిగి కాదు. కావుననే సీతాదేవి హనుమంతునితో (యుద్ధ. ౧౧౬-౩౮) 'నిర్జర విరోధి పనుపున, దర్జించిరి వీర లతని దాసులుగానన్, నిర్జితుఁడొ దశాస్యుఁడు, తర్జింతురె యింక నన్నుఁ దనుచరవర్యా' యని చెప్పెను.

తాత్పర్యము.

సీతాదేవి యీ ప్రకారము చెప్పఁగా రావణునిచే నాజ్ఞాపింపఁబడిన రాక్షసస్త్రీ లామెను కఠినవాక్కు లను బాణములచే మిగుల నొప్పించిరి.

క. కదలక మెదలక తెలియక, పొదవులు నా శింశుపావృక్షావృతుఁడై
బెదరించు చుండ రాక్షస, సుదతులు జానకిని వాయుసూనుఁడు వినినెన్. ౬౧౪

తాత్పర్యము.

ఇటునటు కదలక కైకుఁడై యునక శింశుపావృక్షమునందుండి జానకిని రాక్షసస్త్రీలు బెదరించు మాటల నెల్ల హనుమంతుఁడు వినెను. రావణుఁడు కోరకుండే యామె సీతాదేవి యని హనుమంతుఁడు నిశ్చయించుకొనెను. ఆ నిశ్చయము రావణసీతావాక్యప్రతివాక్యముల వలన స్థిరపడెను. ఇట్లుండఁ రావణుఁడు సీతాదేవి నన్ని

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పుచున్న వారి బెదరింపుమాటలు విని శోకమునఁ గన్నీళ్లు వర్షింపఁగా భయపడి సీత శింశుపావృక్షముచాటునకుఁ బోయెను.

ఆ. బొజ్జ ప్రేలుపొట్ట • ముజ్జనికన్నులు, బుజ్జముక్కు గలిగి • చిట్టి చిట్టి
లాగుకొనుచు వచ్చి • యాడె జానకితోడ, వినత యనెడు నొక్క • వికటరూప.

తాత్పర్యము.

సులభము.

క. పతిపై నెయ్యము మేల్మేల్, సతి ! కనబఱచితివి నీవు • చక్కఁగ నైన్
మితి మీఱిన నది దోసము, పతివ్రా ! కీడునకు మూల • మగు నది వినవే ?

అర్థములు. నెయ్యము = స్నేహము.

తాత్పర్యము.

నీవు నీ మగనిపై స్నేహము చక్కఁగఁ గనఁబఱచితివి. మేలు మేలు. మెచ్చుకొంటినిగాని 'అతి సర్వత్ర వర్జయేత్.' ఏదైనను మితిమించరాదు. మగని మీఁదనైనను ఎంతప్రేమ యుంచవలయునో యంతే యుంచవలయును. ఎక్కువగా నుంచరాదు. మితిమించిన దేదైనను కీడునకుఁ గారణమగును.

సీ. మనుజాంగనలకుఁ దగు • మగనాలితనమును, మేలఁతె చెప్పితి చెప్ప • మెచ్చవచ్చె
నయిన నా చెప్పిన • యత్యంతపథ్య మౌ, మాటలఁ జెవి నిడు • మందయాన
సురనాయకుం డైన • హరిహయునట్టులు, పరవిక్రముఁడు రూప • వంతుఁ డైన
నిఖిల రాక్షసభర్త • నీ ప్రియభర్తగాఁ, గొనుము నా మాటను • వినియుఁ జూడు

గీ. త్యాగి గలవాఁడు కలవాఁడు • భోగపరుఁడు
దక్షిణుండు జనప్రియ • దర్శనుండు
రావణుఁడు నీకుఁ దగినట్టి • ప్రాణవిభుఁడు
కృపణుఁ డగు రామునకు నేల • యిచ్చె దిట్లు ? ౬.౨౦

అర్థములు. మగనాలితనమును = పాతివ్రత్యమును, అత్యంత పథ్యము = మిక్కిలి మేలిచ్చునది, దక్షిణుఁడు = చక్కని మనస్సుగలవాఁడు, నేర్పరి.

తాత్పర్యము.

మనుష్యస్త్రీలకుఁ దగిన పాతివ్రత్యము గురించి చెప్పితివి. బాగుగ నేయున్నది. అయినను అంతకంటె మేలైనది యొకమాట చెప్పెదను వినుము. దేవతాప్రభువైన యింద్రునివలె మిగులఁ బరాక్రమము గలవాఁడు, సుందరుఁడు అయిన రావణుని నీవు భర్తగాఁ గొనుము. ఒకప్పటి నామాట విని మాయ అవల నీకు ఇష్టము లేకున్నను కష్టముతోఁ బిదప వదలిపెట్టుము. రావణుఁడు మహాదాత, భోగమందాసక్తి గలవాఁడు, నేర్పరి, ఎందఱు భార్యలనైన సంతోషపెట్టఁ గలవాఁడు, మాయుటకుఁ ప్రియమైన

నముగా నీవు మాటలాడినను నీయందు దయగలవాఁడై నీవు సుకుమారివౌటచేఁ గోపింపక నిన్నుఁ జంపలేదు. దేశము కాలము నాలోచించి మేము చెప్పుచున్న మాటలు వినవుకదా.

ఉ. ఏరికిఁ జేతి మాడఁగ న్మృగేక్షణ ! శక్యము గాని యీ యకూ
పారము తీరమం దసుర•వల్లభు నంతిపురంబులోన దు
ర్వారత మేము గావ దృఢ•పంజరమందలి చిల్కయట్లు లై
చేరితి వల్ల యింద్రుఁడును • జేరఁగ నేర్చునె నిన్నుఁ గావఁగన్. ౬.౨౫

అర్థములు. అకూపారము = సముద్రము.

తాత్పర్యము.

రాముఁడు వచ్చును. నిన్నుఁ దోడుకొని పోవు ననెదవే. అట్లులే వచ్చును. మొట్టమొదట నా మొదటన నుండువారికి సముద్రతీరమునుండు నీ లంకయు కానరాదు. ఒకవేళ సముద్రము దాఁటి వచ్చె ననుకో, రావణాసురుని యంతఃపురములో నుండు నిన్నుఁ దెలిసికొననే లేఁడు. ఒకవేళ నీ విచ్చట నున్నావని వినినను మేము ఇందఱము కావలి యుండఁగా నిన్నుఁ గాచని మెట్లు తీసికొని పోఁగలఁడే. పంజరములోఁ జిలుకవలెఁ జిక్కితివే. ఆ యింద్రుఁడైన నిన్ను రక్షించుటకు దగ్గఱకైన రాఁగలఁడా ?

చ. వలవనిమాట లాడ, హిత•వాదిని నేను, మదీయవాక్యముల్
చెలువకొ! వీనులం గొనుము • చెక్కులఁ గన్నులనీరు గాఱఁగా
వలవల యేల యేడ్చెద, వ•నర్థము శోక మనర్థకంబెకా
వెలఁది! దశాస్యుతోఁ గడు•వేడుకలన్ విహరింపు మర్మిలిన్. ౬.౨౬

తాత్పర్యము.

సీతా! నే నెంతమాట పనికి కావలయునో యంతేమాట లాడుదును. వ్యర్థముగా మాటలాడలేను. నేను నీకు హితమే చెప్పుదును. అహితము చెప్పను. తెలిసినదా నే నంతటిదానఁగాను. నా మాటలు నీ చెవిలోనికిఁ బోనిమ్ము. చెక్కిళ్ళ వెంబడి కన్నీరు గాఱునట్లు లేల వలవల యేడ్చెదవు. శోకము వలనఁ గీడేకాని మేలు లేదు. కాఁబట్టి క్షేమగలదానవై రావణునితోఁ గ్రీడింపుము.

ఉ. ప్రాయము శాశ్వతం బటవె • భామల, కియ్యది నీ వెఱుంగవా,
తోయజనేత్ర ! జవ్వనము • తూలక మున్న నితాంతకాంతసౌ
ఖ్యాయతి నొందఁ జాఱుము వ•నాంతరవీథులఁ గేళికాద్రులన్
జే యని భోగముల్ సుకువఁ • జేఁ దట దూ యమరాగ్రసేవితోన్. ౬.౨౭

తాత్పర్యము.

ఏమే సీతా! నీకీ వయస్సు ఇట్లులే శాశ్వతముగా నుండునని తలఁచితివా ? ఇంతమాత్రము నీకుఁ దెలియదా? కొన్నాళ్ళ యున్నప్పుడే ఆటలు అల్లోనేరేళ్లు, అవల

రమ్మనిన వచ్చునా? కావున యౌవనము పోకముందే మిక్కిలి మనోహరమైన విహారసౌఖ్యము నీ వనుభవింప యత్నింపుము. అట మలలయందు కేయని రావణుని శోకడః గ్రీసించుట నీకేమి చేదా? చేదు మే పెదవు కాదాలు. మమ్ము గోరువాడు లేఁడుకాని మే మైననా జమ్మని విహరింపమా!

క. సుందరి! బృందారకపర, బృందారకు భర్తగాఁగ • నేలిన నిన్నుం
గ్రందుగ సప్తసహస్రము, లిందీవరలోచనాళు • లెలమి భజించున్. ౬.౨౮

అర్థములు. బృందారకపర= దేవవిరోధు లగు రాక్షసులందు, బృందారకున్= శ్రేష్ఠుని, పుమాన్ బృందారకో జేనే దేవ శ్రేష్ఠమనోజ్ఞయో॥ నానా॥ర. సప్త సహస్రములు = ఏడువేలమంది.

తాత్పర్యము.

సుందరీ, రాక్షసశ్రేష్ఠుఁడైన రావణుని భర్తగాఁ గొనితివి అని యొక్క మాట యనుము. ఇప్పుడే నిన్ను నేడువేలమంది స్త్రీలు వచ్చి పరిచరింతురో లేదో నా మాట చూడుము.

క. సమ్మతి గొన కీ మా వాక్యమ్ముఁ దిరస్కృతి యొనర్పఁ•గాఁ జూచిన నీ
యొమ్ముఁ బగిల్చియు వెస న,స్రమ్మును గ్రోలెదము వింత•చవు లూరంగన్.

అర్థములు. అస్రము = నెత్తురు, తిరస్కృతి = ధిక్కారము.

తాత్పర్యము.

మేము చెప్పిన యీ మాటను సమ్మతింపక తిరుగుపాటు చేసెదవా, యిదిగో చూడు, నీ యొమ్ములు చీల్చి క్రొత్తరుచి పుట్టుచుండ నీ నెత్తురు త్రావెదము.

క. చండోదరి యను రక్కసి, చండతరక్రోధమునను • సాధ్వసకర మా
దండి త్రిశూలముఁ ద్రిప్పుచు, గండున నిట్లనియె జనక•కన్యామణికిన్. ౬.౩౦

అర్థములు. చండతర క్రోధమునను = మిగుల భయంకరమైన కోపముతో, సాధ్వసకరము = భయంకరము.

తాత్పర్యము.

చండోదరి యను రాక్షసి మిగులఁ గోపించినదై భయంకరముగాఁ ద్రిశూలముఁ ద్రిప్పుచు గర్వమున సీతతో నిట్లనెను.

క. త్రాసోత్కంపిపయోధర, నీ సుందరి భీతవన్య•మృగనేత్ర స్వరా
వాసారిహృతను జూడఁగ, వాసిగ నా నోర నీళ్లు • వారెడి యూరెన్. ౬.౩౧

అర్థములు. త్రాసోత్కంపి పయోధర = భయముచే మిగుల వణఁకుచున్న చన్నులుగలది, భీతవన్య మృగనేత్ర = భయపడిన యడవిజింక కన్నులు గలది. స్వర్+ఆవాస+అరి+హృతను=దేవవిరోధి యగు రావణాసురుచే నపహరింపఁబడిన దానిని.

యేమి, దీనిలోనికి నాఁజుగాయలు దీసికొని రాపొండు, చూచెదము. ఎవరు వేగిరము పోయి వచ్చెదరో చూడవలె!

క. అనుచు వజ్రాముఖి పలికిన, విని శూర్పణఖాసమాఖ్య • విని చె యథార్థం
బనియె వజ్రాముఖి, కల్లును, గొనివింకీ యదియ యన్ని • కొదవలు దీర్చున్. ౬౩౫

తాత్పర్యము.

అప్పుడు శూర్పణఖ యనునది యిట్లనెను. అజాముఖ సత్యము చెప్పెను. కల్లును దీసికొని వచ్చితిరా మనకొదవ లన్ని తీరిపోవును.

క. మానుష మాంసంబును సమ్మానముగ నంజికొనుచు • మఱి సురలోనన్
జానుగ నికుంభిలను గోళ్ళీవిరతిం జేల వచ్చు • లీలం బాళిన్. ౬౩౬

అర్థములు. నికుంభిల=ఇది లంకకుఁ బడమటి వైపున నుండిన గ్రామశక్తి, భద్రకాళి. ఈ నికుంభిల యిప్పటికి నున్నది.

తాత్పర్యము.

మనుష్య స్త్రీ మాంసమును కల్లుతో నద్దుకొని నికుంభిల దేవాలయమందున యిష్టము వచ్చినట్లు గంతులు పెట్టవచ్చును.

క. ఈ రీతి నసురకాంతలు, దారుణముగ బెదిరింపులను • దర్జించిన నా
శ్రీరాముదేవి విని బెగ్గు, హా రామా! యనుచు నేడ్చె • నంగలినొందన్! ౬౩౭

తాత్పర్యము.

ఈ విధముగా రాక్షసస్త్రీలు బెదరింపు మాటలాడఁగా శ్రీ సీతాదేవి రామా యని యంగలి నొంది యేడ్చెను. లంకలో సీతాదేవి రాక్షసస్త్రీలచేఁ బడు బాధల వంటివే, దేహమునందలి బద్ధజీవుఁడు సంసారమునఁ బడి యింద్రియాదులచేఁ బడు బాధలు. అయినను రావణుఁడుగాని రాక్షసస్త్రీలుగాని సీతాదేవిని బెదరించిరేగాని చంపఁజాలిన వారుగారు. కావున జీవాత్మ నెవియుఁ జంపఁజాలవు. బాధింపను మాత్రము బాధింతురు. సీతాదేవివలె బద్ధజీవులును ప్రారబ్ధ విశేష మని దృఢచిత్తముతో భగవంతుఁడు రక్షకుఁడని మహా విశ్వాసము కలిగియుండవలెను. సీతాదేవి యింద్రియములకు వశపడలేదని మహావిశ్వాసము కలదని మీఁద దృఢపడెను. తరువాత జీవుఁడు చేయవలసిన భగవద్ధ్యాన మిఁక సీతావిలాపరూపమునఁ జెప్పఁబడును.

—• ౨౫-వ సర్గము, రాక్షసస్త్రీలమాటలకు భయపడి సీతాదేవి యేడ్చుట. •—

ఉ. అండజయాన యిట్లు బహు • శార్తి శ్రమంబున దానవాంగనా
దండములోడ నిట్లు లనుఁ • దత్త్వము బూ పలు కాదరింప, నన్
దిందు యథేష్టవృత్తి, నగు • నే యసుఖార్థము లేదె! మర్త్యనే
తంచసుయాన లేదె? గల • దా విపరీతపుఁజావు ధాత్రిలోన్! ౬౩౮

అర్థములు. అండజయాన = హంసల నడకవంటి నడకగలది, "అండజయాన నీ వోసఁగు నట్టి సపర్యలు వచ్చె" నని మనుచరిత్ర.



గడగడ లాడు నా కలువ • కంటి విశాలము దీర్ఘ మైన నా
జడ యిటు నట్టుఁ బొర్లుచు ను • సంబున కుం దలఁపించె సర్పమున్;
బడఁయక రామ ! లక్ష్మణ ! కృ • పారత ! యత్తరొ కోసలాత్మజా !
చెడితిని హా సుమిత్ర! కృప • సేయరుగా యొక రైన నా యెడన్. ౬౪౨

తాత్పర్యము.

గడగడ వణకుచున్న యీ కలువలవంటి కన్నులుగల సీతాదేవియొక్క విశాలము, నిడివిగల పెద్దజడ సీతాదేవి పలువఁబడి యుండుటచే నీ భుజము మీఁదికి నా భుజము మీఁదికిఁ బొర్లుచుఁ బెద్ద సర్పమును స్మరణమునకుఁ దెచ్చుచుండెను. అయ్యయ్యో రామ! లక్ష్మణ ! దయగల యత్తా, కౌసల్యాదేవీ! హా సుమిత్రా! చెడితిని. ఒకరైన నాయందు దయ దలఁపరు గదా !

దీనివలన నోపాధి బాంధవ్యు లెవ్వరు నెంత యాప్తులైనను నాత్మ నుద్ధారము చేయ లేరని సూచన. స్మృతిమ దలంకారము.

ఉ. తాలిమి పిడ, రాక్షసుల • తర్జనముల్ గనుఁగోను గూర్చు, నా
యేలినవానిఁ బాసి త్రుటి • యేనియు జీవముతోడ నుండుటన్
గాలము కాని కాలమునఁ • గల్గదు మృత్యువు పూరుషాళికిన్
గోలల కన్న సూరివలు • కుల్ కనుఁగొక్కటము నో తెలంపఁగన్. ౬౪౩

అర్థములు. తాలిమి=ఓర్పు, ఏలినవానిన్ = ప్రాణేశ్వరుని, భర్తను, త్రుటి = అల్పకాలమున, కాలముకాని కాలమునన్ = అకాలమున, గోలలకు = స్త్రీలకు, సూరి = పండితులయొక్క.

తాత్పర్యము.

ఓర్పు నశించెను. రాక్షసుల బెదరింపులు బాధింప సాగెను. నా భర్తను బాసి యుండుట గలిగెను. ఈ మూఁడు కారణములచేఁ బ్రాణ మెప్పుడో పోవలసినదే, పోక యున్నది. దీనివలన స్త్రీకిఁగాని, పురుషునకుఁగాని యకాలమున మృత్యువు రాదని చెప్పునట్టి పండితుల మాట సత్యమే కదా. అటు గాకున్న నా దేహమున జీవములు నిల్వఁగారణ మేమి గలదు ?

క. కొఱనోము నోఁచి పున్నము, గఱగొఱ యగు నేను సుడియు • గాలికి జలధిన్
జిఱజిఱను దిరిగి మునిఁగెడి, విఱిగిన కల మనఁగఁ దెడుదు • విభురహితవలెన్. ౬౪౪

అర్థములు. కొఱనోము = పూర్ణముకాని వ్రతము, ఉద్యాపనము నడుపఁ జేయక విడిచినది, గఱగొఱ=తక్కువ, విఱిగిన = పగిలిన, విభురహితవలెన్ = భర్త లేని దానివలె.

తాత్పర్యము.

ఏదియో గొప్ప నోము సలుపఁబూని సాంతముగ నెఱవేర్ప నైతిని. ఆకారణముచే నా నోముఫలము నాకు లేదాయెను. ఆకారణముచే నాకు భర్తయుండియు

లేనిదాననై నదీసముద్రమున సుడిగాలికి గిఱగిఱ దిరిగి విఱిగిన యోడవలె నాపత్సముద్రమున మునుఁగుచున్నాను. నా నోము పంటమైయుండిన యెడల నా పుణ్యఫలమే నా భర్తచే నన్ను రక్షింపఁ జేసి యుండును.

దీని వలన స్త్రీల పాతివ్రత్యము, నోముల ఫలము, వారి భర్తల ప్రాణములను వారిని రక్షించుచున్న దనియు, అట్టి ఫలము లేనియెడల భర్తలుండినను రక్షింపఁజాల రనియు తెల్పుచున్నది. దీనిని బట్టియే యూరకుండాని ప్రకృష్ట మని నానుడి యేర్పడెను. ఇంకొక విద్యాగర్వ్యరా లగు లేని మగవాఁడెంత పుణ్యుఁడు, సమర్థుఁడైనను దానికి సుఖము లేదు.

లోకమునఁ గొందఱు దరిద్రులుగను, కొందఱు భాగ్యవంతులుగను, కొందఱు దుఃఖులుగను, కొందఱు సుఖులుగ నున్నారు. ఈ భేదమునకు వారు వారు చేసిన పుణ్యవిశేషమే కారణము. వారి వారి పుణ్యమునకుఁ దగినట్లు భగవంతుఁడే దేనిని నెట్టి యిచ్చుచుండును. పుణ్యము లేనివారికి ఫలము లేదు. వారు వారు బాగుండుటకుఁ, జెడుటకు వారివారి కర్మమే కారణము.

ఉ. ఆ రఘురాముఁ బ్రాణవిభు • నాదట నేఁ గనుగొంట లేకయున్
క్రూరపలాశినీవశముఁ • గూరి మహావ్యథ బ్రుంగఁ గంటి, దు
ర్వారరయోద్ధతం బయిన • వాహినిచేతను ముస్గు వాహినీ
తీరమునట్లు లే మనుదుఁ • జేఁకువ నుందును జీవయుక్తనై. ౬౮౫

అర్థములు. ఆదటన్ = ప్రేమముతో, క్రూరపలాశినీ వశము = దయలేని రాక్షసస్త్రీల యధీనము, దుర్వారరయోద్ధతంబు = వారింపరాని వేగముచే నతిశయించినది, వాహిని = ఏఱు. జేఁకువన్ = ధైర్యముతో.

తాత్పర్యము.

నా ప్రియవల్లభుఁడైన శ్రీరామచంద్రమూర్తి దర్శనము లేకుండుట యటుండ దయలేని రాక్షసస్త్రీలకు వశపడి మిగుల బాధపడవలసి వచ్చెను. మహా వేగముగ బ్రవహించు నదీవేగమునకుఁ దెగి పడెడి యొడ్డులవలె నేను మరణింపక యేట్టు ధైర్యముతోఁ బ్రాణము ధరించి యుండుదును.

భగవత్ప్రాప్తి లేకుండిన మానను గాక, బాధయైన లేకుండినఁ జాలునని యున్నగాక బాధయు సహింపరాకయున్నది. దీనివలన భగవత్సాక్షాత్కారము గలుగక సంసార బాధ తొలఁగదని చెప్పుచున్నది. ప్రకృతి బంధము మన ప్రయత్నముచేఁ దొలఁగునది కాదు. భగవదనుగ్రహమువలననే తొలఁగవలెను.

క. మాన్యునిఁ గృతజ్ఞు నతిసౌజన్యునిఁ గమలాక్షు సింహ•సమగతిఁ గృతిమూ
ర్ధన్యుని నా ప్రాణవిభున్, ధన్యులుగోఁ గన్నులార • దర్శింతు జనుల్. ౬౮౬

అర్థములు. మాన్యుని = పూజింపఁ దగినవానిని, కృతజ్ఞన్ = చేసినమేలు మఱవనివానిని, నుతిసౌజన్యుని = స్తోత్రము చేయఁబడిన సాధుత్వముగలవానిని. ఈ

ముగా పాత్మగుణములు. కమలాక్షిన్ = కమలములవంటి కన్నులుగలవానిని, సింహసమగతిన్ = సింహము నడకతో సమానమైన నడకగలవానిని, కృతిమూర్ధన్యున్ = పుణ్యకార్యములు చేసినవారిలో శ్రేష్ఠుఁడగు వానిని, ధన్యులు = కృతకృత్యులు, మే = నిజము, నాప్రాణవిభుని పుణ్యాత్ము లందఱు దర్శించుచున్నారుగాని నాకే దర్శించు నదృష్టము లేకున్నది.

ప్రాణములకు విభుఁడు భగవంతుఁడే. అట్టివానిని పుణ్యవంతులు సాక్షాత్కా-రింపఁ జేసికొను చున్నారు. అట్టివాఁడు నా యందుండినను నేను జూడలేకున్నాను. దీనికి నా పాపమేకదా కారణము.

ఇచ్చట నీ శ్రుతివాక్యములు స్మరింపదగు.

"తమక్రతుం పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదా న్మహిమాన మాత్మనః"
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్
సమానే వృక్షే పురుషో నిమగ్నో
ఽనీశయా శోచతి ముహ్యమానః
జుష్టం యదా పశ్యత్యన్య మీశ
మస్య మహిమాన మితి వీతశోకః. ॥ముండక॥

ఒక దేహమందు జీవాత్మ పరమాత్మ లిద్దఱును గలరు. అందు జీవాత్మ సంసారమున మునిఁగి యీశునిఁ గానలేక మోహమున దుఃఖించుచున్నది. అది రెండవవాఁడైన యీశ్వరుని దర్శించునో యప్పుడు శోకరహితమైన దగును.

ఇందాత్మగుణములు దేహగుణములు కలిపి చెప్పుటచే సగుణబ్రహ్మమే సేవ్య మని యట్టివాని సాక్షాత్కారము గలవారే పుణ్యాత్ము లని మోక్షార్హులని తేల్చుచున్నది. "వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షాద్రామాయణాత్మనా" యన్నట్లు సాక్షాద్వేదమైన శ్రీ రామాయణము ఎవ్వఁడు గుణవంతుఁడని ప్రారంభించి శ్రీరామ చంద్రమూర్తి యందు ననురాగము గలవారందఱు ముక్తులైరని యుపక్రమోపసంహారము లేకవిధము గల దన్యాయను. అట్లులే పంచమవేదము "నారాయణం నమస్కృత్య నారాయణ కథా మిమా' మ్మని ప్రారంభించి యందు ముఖ్యములైన విష్ణుసహస్రనామములు, భగవద్గీత, సగుణబ్రహ్మముపాసనమే మోక్షసాధనమని నిర్వహించెను. శ్రీ భాగవతము "విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వనివలన" నని సగుణ బ్రహ్మముతోనే ప్రారంభించి "హరిం దలంపుమిఁక జన్మము గలుగ"దని ముగించెను. బ్రహ్మసూత్రములు 'బ్రహ్మజిజ్ఞాస'యని ప్రారంభించి 'జన్మాద్యస్య యతః' అని సగుణ బ్రహ్మోపాసనతోనే ప్రారంభించి, యట్టివారికి శ్రుతిప్రమాణమున పునర్జన్మము లేదని

'నపునరావృత్తిశబ్దాన్', అని సూత్రించెను. మందబుద్ధియై యిద్దరపోయెడి వాని శాస్త్రము ప్రయుక్తకంబు వాఁడే మేలుకొని యుండునప్పుడు ప్రయుక్తఫలదాయకము. ఇది సర్వమత సమ్మత మార్గము.

క. వసనాభిఁ దినినవానికి, నసువులు వెంట నిలువనట్టు • లమరసనాథున్
వసుధాపతి నెడఁబాసిన, వసమే నా మేనఁ బ్రాణ • వాయువు లుండన్. ౭౪౬

అర్థము. వసనాభి=విషము, అసువులు= ప్రాణములు, అమరసనాథున్ = దేవతలతో సమానుఁడు, వసమే=వశమే. అమరశబ్దము వాస్తవముగ భగవంతునందే ముఖ్యవృత్తి నన్వయము. దేవతలందు గౌణాన్వయము. దేవతలకు బ్రహ్మాదులకున్ మరణముగలదు. భగవంతునకు మాత్రమే మరణములేని వాఁడు కావున నమరుఁడు. క్షీరాదుత్పన్న దీపవత్, దీపమునుండి వచ్చిన దీపమువంటిది గదా పూర్ణావతారములు. కావున రాముఁ డమరసనాథుఁడు. వసుధాపతి=భూదేవియు భగవంతుని భార్యయే కదా ! 'హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ' అని శ్రుతి.

తాత్పర్యము.

విషము దినిన వాని దేహమునుండి ప్రాణవాయువులు తమంతటఁ దామే లేచిపోవును. ఆ విధముగ నమరసన్నిభుఁడు భూపతియు నగు నా భర్తను బాసిన నా దేహమునఁ బ్రాణవాయువు లుండునా ?

క. కటకట యింతగ నెటచే, నలమటపడఁ బూర్వజన్మ • మందును జేసీ
పటుపాపముఁ జేసితినో, కుటిలాత్మిక నగుచు నదియ • పూర్తిగ నేఁడుల్. ౭౪౭

తాత్పర్యము.

ఇంత మహాదుఃఖము ననుభవించుటకు నెంత ఘోరపాపమును బూర్వ జన్మమందుఁ జేసితినో ఆ పాపము నన్నిప్పు డిట్లు బాధించుచున్నది. "అత్యుత్కటై పుణ్యపాపై రిహైవ ఫల మశ్నుతే." అత్యధికమైన పుణ్యముగాని పాపముగాని చేసి యుండిన నీ జన్మమందే ఫలానుభవముగలదు. తక్కినవి మఱుజన్మంబుల ఫలించును.

పూర్వజన్మమునఁ జేసిన పాపము నేఁడిటు లనుభవించు చున్నానని సీతాదేవి చెప్పెనే, ఆమె కర్మవశమునఁ బుట్టినదా ? కాదు. ఈ మాట సాధుస్త్రీల నుద్దేశించి చెప్పఁబడెను. సత్యముగా నుండవలె, వాని కర్థముగాక యుండవలెఁ గావునఁ బూర్వజన్మ మనఁగా బాల్యమని యర్థము. నీ స్వరూపముననే నిలుచుకొని పోనని రామచంద్రమూర్తి చెప్పినప్పుడు నీ వాఁడుదానవుగాని మగవాఁడవాయని దూషించెను. ఆ పాప మిప్పు డిట్లు బాధించు చున్నదని భావము. బ్రహ్మ, క్షత్రియ, వైశ్యుల కుపనయనముతో రెండవ జన్మము వచ్చును. వైశ్యులకు ద్విజన్మ లనిపేరు. సన్న్యాసాశ్రమస్వీకారము జన్మాంతరము. ఈ కారణములచే బాల్యము జన్మాంతరమే. జన్మాంతర మనఁగా నీ దేహము పోయి వేఱు దేహము వచ్చుటే కదా. ఏడు సంవ

క్షీరములకుఁ బరిపూర్ణ మాలిన దేహము నచ్చునుండును. కావున సీతాదేవి యనాలోచిత వాక్యము చెప్పలేదు.

క. ఇక్కరణిని బెను మోహమున, దక్కిన లోకులను మఱఁగి • రక్షింపంగా
నెక్కడి రాముఁడు నా కిట, దిక్కిఁక మాకు మృత్యు• దేవత దక్కన్. ౧౯

తాత్పర్యము.

ఈ విధముగ ఘోరాకృతి రాక్షసస్త్రీలు గుంపుగఁ జేరి యుండఁగ నాకుఁ గావలి యుండ నెక్కడి రాముఁడు? ఎక్కడి నేను? ఆయనవచ్చి రక్షించునని యేమి నమ్మకము? కావున మృత్యు దేవతయే నాకు దిక్కు.

భర్తయందు తన యొప్పు ఓపిక సర్వస్వము ధారవోసియును భగవంతుఁడు సాక్షాత్కరింపఁడేని "కలఁడు కలం డనెడివాఁడు కలఁడో లేఁడో" యను సందేహ మొకానొకవేళ గలుగును. ఈ సందేహ మనునది వ్యతిరేకముగఁ బరిణమింపరాదు. నే నింత శ్రమించి నష్టకష్టముల కోర్చినను భగవంతుఁడు సాక్షాత్కరింపలేదు. కావున నా స్థితినిబట్టి భగవంతుఁడు లేఁడనుకోనరాదు. నాయందే దేదో లోపమున్నది. దాని వలనఁ గానరాలేదని తలఁపవలయును.

క. ఛీ మనుజ జన్మ మేటికి, ఛీ మఱి పరవశ్యమైన • చెనఁటి బ్రతుకు నే
లా! మదిఁ దలంచినప్పుడ, యే మరణముఁ బొంద రామి • యెప్పుడెఁ గంటే.

అర్థములు. పరవశ్యము = పరులకు స్వాధీనపడియుండునది. మనుజ జన్మమేటికి యనుటచే దేవతగా నుండు నేను అకర్మవశతఁ గారార్థమై మనుష్యస్త్రీగాఁ బుట్టుటయుఁ దప్పనియే శోకించుచున్న దని భావము. 'మానవానామిదం పత్యం' మన్నట్లు దీని నూహించునది. మనుష్యజన్మ మేల నింద్య మనిన నది పరవశమైన బ్రదుకు గావున సంసార బద్ధుఁడైన జీవుఁడు స్వతంత్రించి చచ్చినను అసురలోకములు దప్పవు. స్త్రీ పర్యాయంబున నేను పతివ్రతను, భర్తకుఁ బరాధీనురాలను. ఈ దేహము, జీవము భర్తవిగాని నావికాదు. దీనిని బోఁగొట్టుటకుఁ జెఱుచుటకు నాకేమి యధికారము గలదు! కావునఁ బతియాజ్ఞలేక చచ్చుటకు నధికారములేని యీ యస్వతంత్రపు బ్రదుకు పాడు బ్రదుకు గదా యని భావము. సర్వం పరవశం దుఃఖం, సర్వ మాత్మ వశం సుఖ మ్మని స్మృతి కలదు గదా.

తాత్పర్యము.

మనుష్యజన్మ మేమి పాడుజన్మము. ఛీ ఛీ. అందుఁ బరవశమైన బ్రదు కేమి బ్రదుకు. తలఁచినపుడు చచ్చునట్టి యధికారముఁ గూడ లేదాయెఁ గదా.

దీని వలన మనుష్యులు సుఖమో దుఃఖమో ప్రారబ్ధ మనుభవింప వలయునే కాని బలాత్కారమరణముచే దానిని దప్పించుకొన యత్నింపరాదని యేర్పడు చున్నది. దేహి కట్టి యధికారములేదు. అనుభవశేష మెప్పటికైన ననుభవింపవలసి

నదే. రాజవంశీకుఁడైన కారాగృహవాసి సెఱసాలనుండి తప్పించుకొనిన నరునితో తులింపఁబడునా!

—• ౨౬-వ సర్గము. సీతాదేవి శ్రీరాముని దలంచుకొని దుఃఖించుట. •—

ఉ. కొంచెయు చిట్టు శేయ్యఁ బృథి•నీసుత యానతవక్త్రపద్మయై
దండిగ బాష్పవారి ముఖ•తామరసంబున నావరింప గో
త్రం బొరలాడు గోడిగవి•ధంబున నొప్పాచుఁ బిచ్చి యెత్తిన
ట్లుండి ప్రమత్తరీతిఁ దన•యుల్లము భ్రాంతి మునింగినట్లుగన్. ౬౫౧

అర్థములు. ఆనత = వంపఁబడిన, వక్త్రపద్మయై = ముఖకమలము గలదై. బొరలు = దొరలు, రెండు రూపంబులును గలవు. కట్టికే దొంగ దొంగలోనైనవి. గోడిగ=ఆఁడుగుఱ్ఱము. దొరలాడు గోడిగ యనుటచే సంతవఱుకు నొప్పుపట్టుకొని నిలఁబడిన సీతాదేవి యిప్పుడు నేలఁబడి పొరలాడు చున్నదని భావము. దేహాకి దుఃఖమా దుస్సహ మాయెను. అది తప్పించుకొనుటకు బలవంతముగ మరణించుటకు నధికారము లేదాయెను. ఇఁక నీ దుఃఖము వాయుటెట్లు? ఎన్నాళ్ళని యీ దుఃఖ మనుభవింపవలె ననిన దాని కుపాయ మిఁక సీతాదేవి చేసినట్లు రామచంద్రమూర్తిని దలఁచుకొని తెలఁచుకొని సర్వదా ధ్యానించుట గుణవర్ణనము చేయుట నిర్వేద పడుటయే కాని వేఱుపాయము లేదు. దీనికే యభ్యాసయోగ మని పేరు.

"తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనమ్
ఏకాంతే తత్పరత్వంచ తదభ్యాసం విదు స్సుధాః" అధ్యాత్మరామాయణము.
"అథచిత్తం సమాధాతుం నశక్నోషి మయి స్థిరమ్
అభ్యాస యోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ."
యని భ॥ గీ॥ ౧౨-౯ భగవంతు డుపదేశించెను.

ఇరువదినాలుగు గంటలు యావజ్జీవము సమాధియం దుండలేనివారి కిదియే యవ్యవధానమైన యుపాయము. ఈ తీవ్రనిర్వేదఫల మాచార్యప్రాప్తి. అది ముందు చెప్పఁబడును.

అంతవరకుఁ ద్యాగము, మహావిశ్వాసము, చింతనము కార్యములు. ఉత్తరీయము తోడ సర్వాభరణములు తీసివేయుటచేఁ ద్యాగము చెప్పఁబడెను. మహా విశ్వాసము చింతనము ముందు తెలియగలవు.

తా త్ప ర్య ము.

సీతాదేవి తలవంచుకొని కన్నుల నీళ్ళు దండిగఁ గాఱుచుండఁగా నేలఁబడి పొరలాడు నాఁడుగుఱ్ఱము వలెఁ బిచ్చి యెత్తినట్లు శోకావము పొరుటచే దేహము తెలియనిదానివలె మనస్సు తిన్నఁగిను గొన్నగానివలెనై మఱియు చిట్టు శేయ్యుచున్నది

ఇందుఁ దమ మన స్వంతేయు భగవంతునిపై నుంచిన భక్తప్రపన్నుల దశ వర్ణింపఁ బడెను. 'బాహోన్మత్త పిశాచ పిశాలంబన' మన్నట్లు లతివ

తే. పాపజీవిత నయి రామ•భద్రుఁ బాసి, యెట్టులఁ బ్రాణంబులను నిల్పి • యున్న దాన
నే యనార్యను నసతిని•శీలహీన, నెట్టి బ్రదుకు కిది తలఁప నా•కేమి వ్రతము. ౬౯౩

తాత్పర్యము.

రామచంద్రమూర్తి నా విషయమునఁ బ్రమాదపడెను. నన్ను విడిచిపోయె నని నీ వేల యనవలెను? ఆయన యట్లు పోవుట కేమి కారణము? నేను పాప జీవిత నగుటయే కారణము. నేను బుద్ధ్యాస్మరాలనై యుండిన నే నేల పొమ్మందును. ఆయన యేల పోవును? ఆ పాపబలము చేతనే ప్రాణములను విడువలేక దేహమందు నిలిపియున్నదానను. ఎప్పుడు నేను దేహమందభిమానముచేఁ బ్రాణములను నిలిపితినో యప్పుడు నే ననార్యను. ఆర్యనుగాను. పతివ్రతనుగాను, సదాచారవతిని గాను. అయి యుండిన నా కీ కష్టము వచ్చియుండదు. ఇట్టి శీలాదులులేని దిక్కుమాలిన బ్రదుకేమి బ్రదుకు నా పతివ్రత మేమి వ్రతము? అది పర్యాప్తమైనది కాదు.

మ. తినవే వీరలు నా శరీరమును వ్రీ•లింపఁ, దీర ఖండింపనీ
మనఁజాలం జతురబ్ధివలయిత•క్ష్మాభర్త నా భర్తఁ బా
సి నితాంతంబు దురంత మైన వ్యథ గా•సిం బొందు చే నిట్టి కీ
తిని సౌఖ్యంబులు గోరుదానవె? కనుం • కీపో కదే ప్రాణముల్. ౬౯౪

అర్థములు. తినవే=తిననిమ్ము, "ఇచ్చుటకు పర్యాయ శబ్దము." తినవీయుము. తిననిమ్ము, తినవే యని రూపంబులు తిననివ్వని యనునది గ్రామ్యము. ఇచ్చునకు 'ఇవ్వ' శాస్త్రసమ్మతముగాదు. మనఁజాలన్ = బ్రతుకలేను, చతురబ్ధి = నాలుగు సముద్రములచే, వలయిత=చుట్టఁబడిన, క్ష్మా=భూమికి, భర్త=పతి, నితాంతము = మిక్కిలి, దురంతము = అంతములేని.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి సేవ మరల లభించు నను నాశతో దేహమందు అభిమానము వహించి ప్రాణములను దేహమున నిలిపితిని. అది యేమో యాశ లేదాయె. ప్రాణమా బలవంతముగ విడువరాదాయె. దుఃఖములా సహింపరానివాయె నే నేమి చేయుదును? ఈ రావణుఁ డొక్క సముద్రముచేఁ జుట్టఁబడిన యొక ద్వీపమున కధిపతి. నా భర్త నాల్గు సముద్రములచేఁ జుట్టఁబడిన భూమితలమున కంతయు నధిపతి. అట్టివానిని విడిచి మిక్కిలి యంతములేని దుఃఖమునకు పాత్రనై నేను బ్రదుకలేను. కావున నీ రాకాసులు నా దేహమును ముక్కలుగ తినుగాక తిననిమ్ము. ముక్కలు ముక్కలుగా నరుకుదురా, నరుకనిమ్ము. ఈ బాధకంటెను నది గొప్ప బాధగాదు. ఇంత తీవ్రమైన బాధయుఁ గాదు. ఇట్టి స్థితిలో నాకు మంచాలు పరుపులు దిండ్లు భోగములు కావలయునా? ఈ పాడు ప్రాణ మింతటి తీపా?

కీడువలన భర్తృవిమనస్సు భగవంతునిపై నుండవలెఁగాని సౌఖ్యములపై నుండ నీయరాదని యేర్పడుచున్నది.

ఆ. ఎడమ కాలిగోర • నేనియు రావణుఁ దాఁకఁ దాన గాను • దక్క నింత
యెఱిఁగి వలచు ననుట • యది చేటుమాట యున్నమొఱుఁగఁ దెలియు • చెనటి యనుట.

తాత్పర్యము.

రావణాసురుని నే నెడమకాలి గోటనైనఁ దాఁకి తాననగాను. ఇది సత్యము. ఇక వానిని ప్రేమింతు ననుట యేమి మాట? నీ యింతమాత్రము వాఁడు తెలిసికొన లేకయున్నాఁడు. దీనికి వాఁడు సిగ్గువిడిచిన దుష్టుఁడగుటయే కారణము.

ఉ. తిట్టి తిరస్కరించిన మ•దిం దెలియండు, తలంపలేఁడు దాఁ
బుట్టిన వంశమున్ బరువుఁ • బౌరుషముం, దనుఁ దా నెఱుంగఁ డా
కట్టిఁడి, నన్ను వేఁడెడిని • గర్వరసుం డయి, యేమి చేయుఁ దన్
గట్టి యముండు పాశముల • గట్టఁగ నీడ్వఁగఁ జావనున్నెడన్. ౬౫౬

తాత్పర్యము.

నన్నుఁ దాఁకుటకే యిష్టములేనిది నన్ను మోహించునా! యను జ్ఞానము లేదు. అంతటి యూహాబలము లేకుండినఁ బోని, నోరారఁ దిట్టి నీ హమ్మని ధిక్కరించి నను తెలిసికొన లేకున్నాఁడు. అంతియగాక తా నెటువంటి వంశమునఁ బుట్టెను? దాని గౌరవమేమి? తా నెటువంటి వాఁడు? తన గౌరవమేమి? ఇట్లు పిత్రార్జితము స్వార్జితమైన గౌరవమునైన నాలోచించి, నీ మన గౌరవమేమి? ఈ యాఁడుదానిచేత నీ దీనావస్థను ఏయని యైనఁ దలఁపలేక క్రూరుఁడై బెదరించి నన్ను వశపఱచుకొనఁ జూచుచున్నాఁడు. ఇది వాని దోషమా? కాదు. యముఁడు పాశములు వేసి యీడువఁగాఁ జచ్చుటకు సిద్ధముగా నుండువాని కెటువంటి బుద్ధి గాక మంచిబుద్ధి పుట్టి యాలోచన యెట్లు కలుగును. కాలబలముచే వాఁ డిట్లు చేయుచున్నాఁడు.

—• సీతాదేవి రాక్షసస్త్రీలకుఁ బరుషంబుగఁ బ్రత్యుత్తర మిచ్చుట. •—

క. కోయుఁడు కడికండలుగా, వ్రేయుఁడు కత్తులను రోష•వివశత నన్నున్
ద్రోయుఁడు మండెడుమంటల, మీ యుక్తుల విన నిటుల • మిడిసిపడంగన్. ౬౫౭

అర్థములు. కడికండలు = తునుకలు తునుకలు, కడికి = జాలినంత తునుకలు. నోటఁ బెట్టుకొనుటకుఁ జాలినంత చిన్న ముక్కలు, మిడిసి పడంగన్ = మిట్టిపడఁగా

తాత్పర్యము.

మీ నోటఁ బట్టునంత చిన్న తునుకలుగాఁ గోసెదరా కోయుఁడు. కోసించి కత్తులతో నఱకెదరా నఱకుఁడు. మంటలలో వేసి కాల్చెదరా కాల్పుఁడు. మీ యిష్టమేమైనఁ జేయుఁడు. నేను మీ మాటలు వినను. ఏల మీరీ గర్వమున మిట్టి పడెదరు! నా దేహము మీకు వశము. మీ యిష్టమువచ్చినట్లు చేయుఁడు. మనస్సు నా స్వాధీనము. దానిని మీ రేమియుఁ జేయఁజాలరు. అని రాక్షసస్త్రీలకుఁ దెగ జెప్పి మఱల రామధ్యానము చేయుచున్నది.

సీ. నన్నిట్టు లరికట్టు • నిన్నిశాచరుఁ ద్రుంపఁ, జాలియు న న్నేల • నేల రావొ ?
దండకను విరాధు • దండించినట్టి వీ,ర్యాగ్రణీ న న్నేల • యరయ రావొ ?
ఖరదూషణాదుల • ఖండించి ద్రైచిన, శౌర్యుండు న న్నేల • చూడ రావొ ?
రక్కసుచేతిలోఁ • జిక్కిన ప్రియురాలిఁ, బ్రోయాలి న న్నేల • బ్రోవ రావొ ?
తే. జలనిధిమధ్యంబునను లంక • యుండుఁగాక, యన్యులకు నెల్లదుస్సాధ • మగునుగాక
మహిని జగముల నెందును • మాఱులేని, రామబాణంబులకు నడ్డ • మేమి గలదు ?

తాత్పర్యము.

రామచంద్రమూర్తి శక్తిచాలక నన్ను రక్షింప రాలేదనుట సరిగాదని కొన్ని దృష్టాంతములచే నిరూపించుచున్నది.

నన్నీ ప్రకారము నిర్బంధించి బాధపెట్టు నల్పబలుఁడగు రావణుఁ జంప నేల రాకున్నాఁడు ? నా నిమిత్తమైకదా దండకారణ్యమందు విరాధుని వధించెను. నా నిమిత్తమై కదా ఖరదూషణాదులను సంహరించెను. అటువంటివాఁడు తనకుఁ బ్రియురాలను, ఇల్లాలను (బ్రోలు+ఆలు=బ్రోయాలు) నన్నేల రక్షింప రాకున్నాఁడు. అప్పుడు వారందఱు ముఖాముఖి దొరకఁబడిరి. గావునఁ జంపఁ గలిగెను. వీఁడు సముద్రమధ్యమునఁ గాపురమున్నాఁడు. కావునఁ జంపలేఁ డందునా ! లంక సముద్రమధ్యమున నుండిన నుండుఁగాక. ఇతరుల కిచ్చటికి వచ్చుట యసాధ్యమైన నగును గాక. మూఁడులోకములందును నడ్డములేని రామబాణములకు నీ సముద్రమా యడ్డము.

విషజలాప్యయాత్ వ్యాళరాక్షసాత్ వర్షమారుతాత్ వైద్యుతానలాత్
వృషమయాత్మజాత్ విశ్వతోభయాత్ వృషభ తే వయం రక్షితా ముహుః ॥

అను గోపికల వాక్యము స్మరించునది. కృష్ణసాన్నిధ్యమునకై రుక్మిణీ గోపికల పరితాప మెట్టిదో సీతాపరితాప మట్టిదిగా నెంచనగు.

ఉ. సంచితు మయ్యె నా విభుఁడు • చాలఁడు నే నిట నుండ కుండఁగ, నీ
చంద మెఱింగి యున్నయెడ • సైచున మానధనుండు; రామ! నీ
సుందరి రావణాసురుఁడ • సుమ్ము హరించె నటంచుఁ జెప్పఁడే
మందల నీడ కున్న నవ • మానబలుం డల గృధ్రనాథుఁడేన్. ౬౬౦

అర్థములు. మానధనుండు = మానమే ధనముగాఁ గలవాఁడు. మందల= బ్రదుకుపాటు, జీవితము.

తాత్పర్యము.

నాయుం డెంతయో ప్రేమగలవాఁడు, ఎన్ని యాపదలనుండియో నన్ను రక్షించినవాఁడు. నేఁడు నామీఁద దయతప్పినాఁడని కాని, శక్తిచాలక యూరకున్నాఁడని చెప్ప సాధ్యపడదు. అట్లైన నేల యూరకున్నాఁడు? నే నిచ్చట నుండునది యాయనకుఁ దెలియదని నా సందేహము. ఆ కారణముచే నూరకున్నాఁడుగాని, తెలిసియుం

డిన పౌరుషశాలి తనభార్యను బలిమి నపహరించె నన్న యవమానము నెట్లు సహించును? సహింపఁడు. రాత్రింబగలు నెఱియక యూరకున్నాఁడా యనిన నట్లు చెప్పుటకు వలను పడదు. ఏలన జటాయుప్రాణము పోకయుండెనా యాయన నీ భార్యను రావణాసురుఁడు హరించె నని చెప్పకుండునా? చెప్పియే యుండును గాని రామచంద్ర మూర్తి వచ్చువఱకు నతఁడు జీవించి యుండునో లేదో.

ఉ. అంతము నొందఁ జేసె నసు•రాగ్రణి యీసు జటాయుఁ బట్టి, వా
డెంతటి పెంపు చేసెఁ గను•వృద్ధుఁడు నయ్యును, ద్వంద్వయుద్ధమం
దింతల నంతలం జనక • యేడ్తెఱ చూపె మదర్థ, మక్కటా
యెంతను లేఁడు నాకు దుర•దృష్టను కాలముగాదు వానికిన్. ౬౬౧

అర్థములు. అంతము = మరణము, ఇంతల నంతలన్ = కొంచెపుఁ బ్రయత్నముతో, ఏడ్తెఱ = పరాక్రమము, మదర్థము = నా నిమిత్తము, ఎంతను లేఁడు = ఎంతకార్యమైనను జేయఁజాలనివాఁడా? కాలము = అనుకూల కాలము.

తాత్పర్యము.

సీతాదేవి యాలోచన క్రమమందు జటాయువు స్మరణమునకు రాఁగా వానిని గుఱించి యనుకొనుచున్నది. రావణుఁడు వీరుఁడైన జటాయువును జంపెనుగాని, వాఁడు ముసలివాఁ డయ్యును ఎంతసాహసము చేసెను. నిరాయుధుఁడై ద్వంద్వయుద్ధమందుఁ దన పరాక్రమ మంతయుఁ జూపెనుగాని, కొంచెముతో వీనిని విడిచెనా? వాఁ డీకార్య మెంతయైనఁ జేసి జయించియుండును. నా దురదృష్టముచేతఁ గాలము వాని కనుకూలించి వచ్చినదికాదు.

సర్వం కాల మపేక్షతే విధివశాత్ నైవాస్మి కాలక్షమః॥

చండకౌశికమందు హరిశ్చంద్ర వాక్యము

ఉ. నాయిటు నుండు జాడ రఘు•నాయకుఁ డింత యెఱింగెనేని య
త్యాయతకోపఘూర్ణహృద•యుంబున లోక మరాక్షసంబుగాఁ
జేయఁడె? యీనిమేషమున • సింధువునం బెనుమువ్వ లేఁపఁడె!
మాయఁగఁ జేయఁడే ఖలుని•మానముఁ బ్రాణము నొముమ్ముం బురిన్. ౬౬౨

అర్థములు. ఇంత = రావణాసురుఁడు నీ భార్యను హరించెను అను మూఁడు మాటలు మాత్రము, అత్యాయత = మిగుల విస్తారమైన, కోప = కోపముచే, ఘూర్ణ = తిరుగుచు నున్న, హృదయంబునన్ = మనస్సుచే, అరాక్షసము = రాక్షసులు లేని దానిఁగా, సింధువునన్ = సముద్రమందు.

తాత్పర్యము.

నే నీలంకలో నున్నదాన నను మాట మాత్రము తెలిసినవాఁడయ్యెనా రామచంద్రమూర్తి మిగులఁ గోపించినవాఁడై లోకమున రాక్షసుఁ డనువాఁడు లేకుండఁ జేయకుండునా? ఈ నిమిషమున సముద్రము నీళ్ళన్నియు నిగిరించి సమ్ముట్లు లేఁగునట్లు

క. తూర్ణంబ నాదుకోరిక, పూర్ణం బగుఁ, జెడెడివారు ♦ పొలఁతులు! మీ మీ
దుర్ణయముల మీరే యిది, నిర్ణయముగ వినుఁడు పిదప ♦ నిజము గనుఁడీ. ౬౬౬

అర్థములు. తూర్ణంబ = శీఘ్రముగ.

తాత్పర్యము.

ఓ స్త్రీలారా ! నా కోరిక త్వరలోనే నెఱవేఱును మీ మీ చెడు కార్యముల మీరే చెడిపోదురు. ఇది నిశ్చయము. ఇప్పుడు వినుఁడు. తరువాత నిజమైనప్పుడు చూచుడు.

ఇది యంతయు దేహేంద్రియముల కన్వయింపవలెను.

చ. తెలఁగడి నిప్పు డీ పురిని ♦ జేటును దెల్పెడు చిహ్నలక్షణం
బులు, నిజ మీ పురంబు చెడి♦పోవును నిష్ప్రభమై, దశాననుం
డిలుగ దురాసదం బయిన♦యీ నగరంబు ముహూర్తమాత్రలో
పల సొబగాఱి చెడుం గొమరుఁ♦ బ్రాయపురంధ్రను బోలి, చూడుఁడీ. ౬౬౭

అర్థములు. నిష్ప్రభమై = కాంతిహీనమై, ఇలుగన్ = ఈలుగన్ = చావఁగా, దురాసదంబు = ఇతరులకు లభింపనిది, కొమరుఁ బ్రాయపురంధ్ర = లేఁత వయసు విధవ.

తాత్పర్యము.

ఈ పురము పాడైపోవు లక్షణములు పెక్కులు కానవచ్చుచున్నవి. ఈ యూరు కాంతిహీనమై చెడిపోవుట నిజము. ఇతరులకుఁ బ్రవేశింప సాధ్యముగాని యీ పురము స్వల్పకాలమున బాలవిధవవలె నందము చెడిన దగును. చూచుచుండుఁడు. 'వ్యభిచారరతా నారీ బాలరండాతు జాయతే' పోయిన జన్మమున రంకాడిన స్త్రీ యీ జన్మమున బాలవిధవ యగును. అట్లులే యీ పురమింకను నెంతోకాలము బాగుండవలసిన దయ్యును నిందు వ్యభిచారము లెక్కువగుటచే త్వరలోనే పతిహీనయై పాడగును.

క. భాసురపుణ్యోత్సవములు, వాసిగ శుభలక్షణములు ♦ పాయుచు విధవా
వాసం బగుచును బూర్వసు, వాసినివలె నుండు లంక ♦ పతి మరణింపన్. ౬౬౮

అర్థములు. విధవావాసము = ముండలకు నెలవు, పూర్వసువాసిని = ముందు ముత్తైదువుగా నుండునది. అనఁగా నిప్పుడు విధవ.

తాత్పర్యము.

పతియగు రావణుఁడు చచ్చిన కారణముచే నీలంక పుణ్యోత్సవములు శుభచిహ్నములు పోయినదై పుణ్యములగు పండుగలు పసుపు కుంకుమ కాటుక గంధము కమ్మలు పాపట మొదలయిన శుభలక్షణములు పోయిన విధవవలె విధవల కునికిపట్టయియుండును.

కొఱుకుఁగదు గాదోలు. తన్నుఁ బాసి నే నెట్టివిధము లయ్యెనుగదా చెప్పుటచే నైన తెలిసియుండెనా? భూమండల మంతయు నేలుచున్న యేల యూరకుండును. నాదుఃఖ విధము తెలిసి వెదకింపక యుండుటచే నతఁడిలో నా శోకముచే మునిఁగించెనే! ఇఁక నే నేమిచేయుదును?

క. ధన్యులు రఘుకులనృపమూర్ధన్యుని నా హృదయనాథునిన్ • రాముని నతిరా
జన్యుని రాజీవాక్షుని, మాన్యునిఁ గను దేవసిద్ధ • మౌనిప్రవరుల్. ౭౪౭

తాత్పర్యము.

౭౪౭ పద్యమునఁ జూచునది. అందు రామదర్శన భాగ్యము గల ఇహలోక జనులు ధన్యులని చెప్పఁబడెను. ఇందు అయినచో పరలోకంబునఁ గాను దేవతలు సిద్ధులు మౌనులు ధన్యులని చెప్పఁబడెను. అందు జేరూప గుణ విశేషములు చెప్పఁబడెనో యిందు నా గుణవిశేషములే చెప్పఁబడెను. ఇట్లే లోకమూర్తికిఁ బరలోకమూర్తికి భేదము చెప్పఁబడెను.

'భక్తాస్తే యాదృశే రూపే సంసారపరిసంశ్రితాః తాదృశం తే సమాయాంతే, పరమవ్యోమవాసినః॥ సంసారమం దున్నప్పుడు భక్తు లెట్టిరూపముతో వాస క్తులై చూడఁగోరుదురో పరమపదమం దట్టి రూపముననే వారు చూడఁగలరు. ఇందు సీతా రాముల సేవించుచు ముక్తు లగువారికిఁ బరమపదమందు భగవంతుఁడు సీతారామ మూర్తిగనే కానవచ్చును. కృష్ణుని సేవించువారికి కృష్ణుఁడుగానే కానవచ్చును. భయంకరమూర్తులగు భూతాదుల పతుల సేవించు తామసులకు భూతపతులు గానే కానవచ్చును. కావుననే (శ్రీ)భాగవతమున సాత్త్వికులు భయంకర భూత పతుల వదలి సౌమ్యుఁడైన విష్ణువునే సేవింతు రని ప్రథమస్కంధమునఁ జెప్పబడెను. శంకరాచార్యులవారి తల్లి చరిత్ర స్మరింపునది.

ఈ లోకమున సాధువులతోఁ గలసి వర్తించు సాధువునకు సుఖము, సంతోషము గలుగు. దుష్టులతోఁడ వర్తించు సాధువునకు సుఖము లేదు. అట్లే ఇచ్చటి సాత్త్వికునకుఁ బరలోకమున సాత్త్వికులతోఁ గలిసిన సుఖము, సంతోషము గలుగు. ఇచ్చట మిశ్ర సాత్త్వికుఁ డనఁగాఁ గొంత సత్త్వగుణము, కొంత తమోగుణము గల వాఁడు. పరలోకమున భూతప్రేతపిశాచములతోఁ గలసి వర్తించుట సుఖసంతోష కరముగాదు. కావున సాత్త్వికులు సత్త్వగుణము గల భగవంతునే యారాధింపవలెను.

క. పరమాత్ముఁడు ధీమంతుఁడు. నిరతము ధర్మైకరతుఁడు • నృపసుతుఁ డగు నా
వరశీలుని కా లగునం, బరఁగెడి నా నలిన నేమి • ఫల మాయువునన్. ౭౪౮

అర్థములు. పరమాత్ముఁడు (౧) ఆత్మల కన్నిటికిఁ బరముఁడైన వాఁడు, (౨) శ్రేష్ఠమైన స్వభావము గలవాఁడు, ధీమంతుఁడు = బుద్ధిమంతుఁడు, ఆశ్రితుల నెట్లు రక్షింతునా యను నాలోచన గలవాఁడు, ధర్మైకరతుఁడు = ధర్మము నందే ప్రీతిగలవాఁడు, నిరతము = ఎల్లప్పుడు, నృపసుతుఁడు = రాజులందు ఋషివంటి

త్యక్తకలుషులై = వదలిపెట్టఁబడిన పాపములుగలవారై, కలుషము = ద్వంద్వము, ప్రాంతరమున్ = మనస్సును; ప్రియాప్రియంబులన్ = ఇష్టములయొక్క యనిష్టములయొక్క, పొంతలన్ = సమీపమందు, విజితేంద్రియులై = జయింపఁబడిన మనస్సు ఇంద్రియములు గలవారై.

తాత్పర్యము.

మనస్సును నింద్రియములను జయించిన వారై శీతోష్ణములు సుఖదుఃఖములు లాభాలాభములు లోనగు ద్వంద్వము లనఁబడు కలుషముల వదలినవారై మనస్సును ప్రియమునకుఁ గాని యప్రియమునకుఁ గాని సమీపమునకైనఁ బోనియక సుఖము వచ్చిన సంతోషింపక యప్రియము వచ్చిన దుఃఖింపక రెంటను నేకవిధముగ నుండి శాంతమైన నే వ్యసనము లేకయుండు మునీశ్వరు లెంత పుణ్యాత్ములో.

క. ప్రియమున సంతోషం బప్రియమున నధికముగ భయము • పృథివి జనించున్
భయమును ముదమును విడిచిన, యభయగుణులకు మ్రొక్కెదాన•నవహితమతినై.

అర్థములు. అభయగుణులకున్ = శుభము గలిగించు గుణములు గలవారికి, అవహితమతినై = హెచ్చరికతోఁ గూడిన మనస్సు గలదాననై.

తాత్పర్యము.

దేహాభిమానము గలవారికిఁ బ్రియము కలిగినా సంతోషము కలుగును. అప్రియము కలిగినా భయము కలుగును. కావున మనస్సు ప్రియము మీఁదను అప్రియము మీఁదను బోకపోయినా ముదములేదు, భయములేదు. కావున నట్టి శుభకరమైన గుణములు గలవారికి హెచ్చరిక గలదాననై మ్రొక్కెదను.

ముని యని చెప్పుటచేత నీ రెండు పద్యములు వానప్రస్థుల విషయ మని యేర్పడుచున్నది. అయినను నిది నాకు స్వధర్మము గావున నా విషయ మాలోచింపఁ బని లేదనుకొను చున్నది.

క. కావున విదితాత్మం డగు, కేవల మత్ప్రియుని రాముఁ • గీర్తితగుణునిన్
బో విడిచి పాపిష్ఠుర్వన, కే వశపడి యుండఁ గలనె•మృత్యువ్వుఁ గందున్. ౫౧

అర్థములు. విదితాత్ముండగు = తెలియఁబడిన ఆత్మగలవాఁడు, కేవల మత్ప్రియుండు = నాకుఁ గేవలము ప్రియుఁడగువాఁడు, అంతకంటెఁ బ్రియమైనది నాకు లేదు. కీర్తితగుణునిన్ = కీర్తింపఁబడిన గుణములు గలవానిని, పాపిష్ఠుర్వనకు = పాపపు రాక్షసునకు.

తాత్పర్యము.

ఆత్మజ్ఞానము గలవాఁడై నాకుఁ బ్రియుఁడైన వాఁడొక్కఁడే యయి కీర్తింపఁబడిన సద్గుణములు గల రామచంద్రమూర్తిని విడిచి యాత్మజ్ఞానము లేక నా ప్రీతికిఁ బాత్రుఁడుగాక నింద్యగణములు గల పాపపు రావణాసురునకు స్వాధీనపడి యుండఁ గలనా? చావనైనఁ జచ్చెదను గాని.

—• ౨౭-వ సర్గము. త్రిజట తన స్వప్నవృత్తాంతము రాక్షసస్త్రీలకుఁ జెప్పుట. •—

క. అనిన విని యాయమ మాటలు, తను గింకిరిపాటు గదురఁ • గొందఱు రక్షో
వనితలు దశకంఠునకున్, వినిపింపఁగఁ జనిరి సీత•వృత్తాంతంబున్. ౬౮౬

అర్థములు. కింకిరిపాటు = కోపము.

తా త్ప ర్య ము.

సీతాదేవి చెప్పిన యా మాటలు విని రాక్షసస్త్రీలు కోపించినవారై కొందఱు రావణాసురుని పాలికిఁ బోయి రాజా నీవు చెప్పినట్లు మే మామెను నయమున భయమునఁ జెప్పి చూచితిమి. మా మాట విన లేదు. మరణింప యత్నించుచున్నది యని చెప్పిరి.

క. కొందఱు కరాళవదనలు, ముందర నిలుచుండి రామ•ముదితం గని యో
మందమతీ! నీదు మాంసం, బిందఱమును గుడుతు మనుచు • నేకార్థముగన్.

తా త్ప ర్య ము.

మఱి కొందఱు మిట్టపండ్లు గల నోళ్ళవారు సీతాదేవి కెదురుగ నిలఁబడి యోసీ బుద్ధిలేని దానా! యిప్పుడే నిన్నుఁ జంపి నీ మాంసము నిందఱము పంచుకొనెద మని యొక్క మాటగాఁ జెప్పిరి

క. వారలను గాంచి నిద్దురఁ, గూరిన యొకవృద్ధ మేలు•కొని త్రిజట యనన్
బేరుగది యిట్టులు పలికెఁ, దీరలు చాలింపుఁ డింక•యీ యీ మాటల్. ౬౮౮

తా త్ప ర్య ము.

అప్పు డచ్చట నిద్దుర పోవుచున్న యొక ముసలి రాక్షసి త్రిజట యనునది మేలుకని వారి మాటలు విని వారితో నిట్లనెను. యీ యీ మాటలు మీరు చాలింపుఁడు. అది శక్తిహీనతచే లేచి కూర్చుండు నవకాశము లేక పరుండియే చెప్పుచున్నది.

క. మీ రిటు సీతను రాముని, దారను జనకేంద్రసుతను • దశరథు స్నుషనన్
జేరి భుజింపకుఁడీ! పొందీ, దారుణముగ నన్నుఁ దినుఁడు • తొయ్యలులారా! ౬౮౯

తా త్ప ర్య ము.

అసురాంగనలారా! సీతాదేవిని, రాముని భార్యను, జనకరాజ పుత్రికను, దశరథుని కోడలిని మీరా భుజించువారు. చాలుఁ జాలు, సహారముగఁ బొందకుడు, ఆమెను బాధింపకుఁడు. మీరు తినవలె నని యున్న నామె బదులు నన్నుఁ దినుఁడు.

మ. కలఁ గంటిం జెలులార! యే మనుము రో•మాంచంబు పో దిప్పుడున్
దలఁపన్ దాని, సమూలనాశనము సి•ద్ధం బాశరశ్రేణికిన్, కీ
నళినాక్షీమణిభర్తకున్ జయము నా•నం బో వనన్, భీత ల
చ్చోటువల్ నీ కల నొట్టి కీ విశేష వనం • జెప్పెం దనీయార్థమున్. ౬౯౦

అర్థములు. రోమాంచంబు = దేహమున పులకలు, ఆశరశ్రేణికిన్ = రాక్షస

సమూహమునకు, సమూలనాశనము = వేరుతోడ పాడైపోవుట, భీతలు = భయపడినవారు, నిశిన్ = రాత్రియందు, తదీయార్థమున్ = ఆ కలయందలి విషయమును. ఈ త్రిజట విభీషణుని కూఁతు రని కొంద ఱందురు.

తాత్పర్యము.

అమ్మలారా! నే నొక కల గంటిని. నే నేమని చెప్పుదును. దానిని దలఁచుకొనిన నా దేహ మిప్పటికిని వణఁకుచున్నది. దానివలన రాక్షస సమూహము మూలముట్టుగ నాశనము కాఁగలదు. ఈ సీతాదేవి భర్తకు జయము తప్పదు. అని చెప్పఁగా వారు భయపడి నీ వెట్టి కలగంటివి చెప్పుమన నా కలయందలి విషయ మా త్రిజట యిట్లు చెప్పెను.

సీ. ఆకాశగమనంబు • హంససహస్రంబు, గజదంతమయ మైన • కలికి పల్ల
కీలోనఁ దెల్లని • మాలికల్ చేలముల్, దాల్చి సుమిత్రాగ్ర • తనయుతోడ
రామచంద్రుఁడు వచ్చె • రమణీయశుక్లాంబ, రావృత యగుచు నీ • దేవి పాల
వెల్లిలోపల నున్న • వెల్లనిగట్టుపై, భానునితోఁ బ్రభ • పరఁగునట్లు
ఆ. రామచంద్రుతోడ • రంజిల్లఁ గంటిని, ధరముఁబోలి నాల్గు • దంతములను
మీఱుచున్న గజము • మీఁద లక్ష్మణుఁ, గౌసలేయు నరుగఁ • గంటిఁ గలను.

అర్థములు. ఆకాశగమనంబు = ఆకాశమునఁ బోవునది, గజదంతమయము = ఏనుఁగు దంతముతోఁ జేసినది, శుక్లాంబరావృత = తెల్లని వస్త్రము కట్టుకొన్నది, పాలవెల్లి = క్షీరసముద్రము, గట్టు = పర్వతము, ధరము = పర్వతము, కౌసలేయున్ = రామచంద్రమూర్తిని.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి యాకాశమునం బోవునట్టిదియు, వేయి హంసలు గట్టినట్టిదియు, తెల్లని యేనుఁగు దంతముతోఁ జేయఁబడినదియు నగు పల్లకిలో తెల్లని పూలసరములు వస్త్రములు ధరించిన లక్ష్మణునితోడ వచ్చెను. ఈ సీతాదేవి యందమైన తెల్లని చీర గట్టుకొని పాల సముద్రమునందలి తెల్లని పర్వతముమీఁద సూర్యునితోడఁ బ్రభ యున్నట్టు లాయనతోడ నుండఁ గంటిని. నాలుగు దంతములు గలదై కొండవలె నున్న యేనుఁగుమీఁద లక్ష్మణుతోడ రాముఁడు పోవఁ గంటిని.

"ఆరోహణం గోవృషకుంజరాణాం, ప్రాసాద శైలాగ్ర వనస్పతీనాం, విష్ఠానులేపో రుదితం మృతంచ స్వప్నేష్వగమ్యాగమనంచ ధన్యం" (స్వప్నాధ్యాయము) కలలందు ఎద్దులను, ఏనుఁగులను, మేడలను, కొండశిఖరములను, కాను పూను చెట్లను ఎక్కుటయు, మలము పూసికొనుట, ఏడ్చుట, చచ్చుట, పొందరాని దానితోఁ బొందుట—ఇవి శుభములు.

క. తెల్లని వలిపపుఁ జేలలఁ, దెల్లని మాల్యములు దాల్చి • ధీరోత్తము లీ
పల్లవపద చెంగట రంజిల్లఁగ రఘుకులులఁ గంటిఁ • జిత్రం బగులన్. ఊ-౩

తాత్పర్యము.

తెల్లని మడివలువలు తెల్లని పూలదండలు ధరించి తమలలో శ్రేష్ఠులైన రామలక్ష్మణులు చిగుళ్ళవంటి పాదములు గల యీమె ప్రక్కను సంతోషముతో నుండఁ గంటిని. అది చూడఁగానే నా గుండెలు పగిలెను.

తే. అంత నా పర్వతాగ్రంబు•నందు నొంటి, నొంటి యుండిన కరిపై • నబ్జమిత్ర
కులుని తొడమీఁద నెక్కి యీ•కలువకంటి,తరణి చంద్రుల నంటు వి•ధంబుఁ గంటి.

అర్థములు. కరి = ఏనుఁగు, అబ్జమిత్రకులునితోడ = సూర్యవంశమునఁ బుట్టిన రామచంద్రమూర్తితోడ, తరణి చంద్రులన్ = సూర్యచంద్రులను.

తాత్పర్యము.

అవల నా పర్వతము శిఖరమునందు నాకాశముఁ దాఁకుచున్న యేనుఁగుమీఁద రాముని తొడమీఁద నీ సీతాదేవియుండి సూర్యచంద్రులఁ దాఁకుచున్నట్లు చూచితిని.

ఆదిత్య మండలం వాపి చంద్రమండల మేవవా
స్వప్నే గృహ్ణాతి హస్తాభ్యాం రాజ్యం సంప్రాప్నుయా న్మహత్.

కలయందు సూర్యమండలముగాని, చంద్రమండలముగాని చేతులతోఁ బట్టుకొన్నట్లు కనఁబడినా వానికి గొప్పరాజ్యము లభించును.

క. రా కొమరులు రాజాస్యయుఁ, బ్రాకటముగ నెక్కినట్టి • భద్రేభము నే
నాకసమున లంకపయిన్, జోకగ నిలువంగఁ గంటి • సుందరులారా! [illegible]

అర్థములు. రాకొమరులు = రాజకుమారులు, రాజాస్య = చంద్రునివంటి ముఖముగలది, భద్రేభము = భద్రజాతి యేనుఁగు.

తాత్పర్యము.

రాజకుమారులు రామలక్ష్మణులు చంద్రునివంటి ముఖము గల సీతాదేవి స్పష్టముగ భద్రజాతి యేనుఁగుపై నెక్కి లంకమీఁద నాకాశమున నున్నట్లు గంటిని.

క. అంచిత వృషభాష్టకముం, బూంచిన రథ మెక్కి పురుష•పుంగవుఁ డిట కే
చంచలలోచనతో నను, దెంచుట నేఁ గంటిఁ గొఱలి•తెలియఁగ వినుఁడీ. [illegible]

అర్థములు. వృషభాష్టకము = ఎనిమిది యెద్దులు, పూంచిన = పూనునట్లు చేసిన.

తాత్పర్యము.

మంచి యెద్దు లెనిమిది కట్టిన తేరెక్కి రామచంద్రుఁడు ఈ సీతాదేవితో వచ్చుచుండుట గంటిని. తక్కిన కల చెప్పెద వినుఁడు.

తే. అర్కసన్నిభ పుష్పకా•ఖ్యాతి దేవ, యానమున వార లీ గజ•యానతోడ
నుత్తరంబుగ నరుగుట•యుత్సవముగఁ, గన్నులారంగఁ గంటి నేఁ•గలను జూడి.

అర్కసన్నిభ = సూర్యునితో సమానమైన, పుష్పక+ఆఖ్యాత = పుష్పకమను పేరు గల, దేవయానమున = విమానమునందు, వారలు = రామలక్ష్మణులు.

తాత్పర్యము.

సూర్యకాంతిగల పుష్పకవిమాన మెక్కి రామలక్ష్మణు లుత్తరముగ కీ సీతతోడఁ బోవఁ జూచితిని.

క. ఆ విష్ణుపరాక్రముఁ డగు, ధీవిభవుఁడు రామవిభుఁడు • తేజం బెసఁగం
గా వెలఁదియుఁ దమ్ముఁడుఁ దా, నీ విధమున నుండఁ గంటి • నిది సక్కం బౌ.

తాత్పర్యము.

విష్ణు పరాక్రముఁడు, మహాబుద్ధిశాలి యగు రామచంద్రమూర్తి సీతతోను, దమ్మునితోను నీ విధముగ నుండఁగా నేను జూచితిని. ఇది నిజమగును.

స్వప్నక్రమ మే మనఁగా:—రామలక్ష్మణులు పల్లకిలో నెక్కి సీతను గూర్చి లంకాసమీపమునకు వచ్చిరి. లంక దగ్గఱ చాల సముద్రమునందు నొక తెల్లనికొండ యీ కలయందుఁ గనఁబడెను. అప్పటికి రామచంద్రమూర్తి వచ్చి చేరెను. సీతయు నా కొండయం దుండినది. రామలక్ష్మణులు పల్లకి దిగి యేనుఁగుపై నెక్కి సీత యొద్దకు వచ్చిరి. సీతయు నేనుఁగుపై నెక్కి తెల్లని తొడపైఁ గూర్చుండి నిక్కి సూర్యచంద్రులను బట్టుచుండినది. ఆ విధముగ వారు లంకమీఁదికి నాకాశ మార్గమున వచ్చి యేనుఁగు దిగి యెనిమిది యెద్దులు కట్టిన తేరుపై గూర్చుండి లంకలోనికి వచ్చి పుష్పకము నెక్కి యుత్తర దిక్కుగాఁ బోయిరి.

క. పాపాత్ములు స్వర్గంబున, దాపున కరుగంగ లేని • తద్గతి రామున్
రూపింప నైన నేరరు, సాపత్న్యసురారిగణము • సంగరవీథిన్. ౬౯౮

అర్థములు. సాపత్న్య = దేవతాసమూహము, సురారిగణము = రాక్షస సమూహము, సంగరవీథిన్ = యుద్ధరంగమందు.

తాత్పర్యము.

పాపాత్ములు స్వర్గము సమీపమునకైన నెట్లు పోలేరో యీ విధముగ దేవ రాక్షస సమూహములు యుద్ధరంగమందు శ్రీరామచంద్రమూర్తిని సమీపింప లేవు.

సీ. పరికించితిని గంటిఁ • దైలలిప్తాంగుఁ డై, తైలంబుఁ ద్రోలు చు • న్మత్తుఁ డగుచు
గన్నేరు పూలు • గళమున వ్రేలంగ. రక్తాంబరంబులు • గ్రాలు చుండ
ముండుఁడై, కృష్ణాంబ • రుండయి నెండిరయుఁ, బుష్పకంబున నుండి • పుడమిఁ గూలఁ
బడఁతి యాకర్షింగను • బాధలు పడుచుండఁ, గంటి నేఁ గల బోఁటు • కాంతిలార!
తే. మఱియు ఖరయుక్తరథమున • మలయు వాని, రక్తమాల్యాను లేపన • యుక్తుఁ డగుచు
భ్రాంతమతి నూనెఁ ద్రాగుచు • గంతు లిడుచు, నగుచు నాడిన వైన దశ • కంఠుఁ గాంచి.

అర్థములు. తైలలిప్తాంగుఁడై = నూనె పూసికొనిన దేహము గలవాఁడై, ద్రోలుచున్ = త్రాగుచు, ముండుఁడై = బోడితల గలవాఁడై, కృష్ణాంబరుం డయి = నల్లని గుడ్డ కట్టుకొన్నవాఁడై.

రెండు(గ్రామముల పొలమును జూచునుగదా) ఇట్లు సంధియం దున్నవాఁడై యీ లోకమున జాగ్రద్దశయందలి విషయములను బరలోకమున స్వప్నదశయందలి విషయములను జూచినవాఁడై పరలోకమార్గమును(తాను జేసిన పుణ్యపాప ఫలానుభవము కొలఁదిఁ) బట్టి పోయి స్వప్నప్రపంచ మందునిలిచి యీ లోకమున జాగ్రద్దశ యందలి పాపములను, స్వప్నమునఁ బరలోకమందలి సుఖములను జూచుచున్నాఁడు. భగవంతుఁడే వీనిని నిద్రవున్నప్పుడు వానికి మేలుకొనినపు డున్న జ్ఞానమును ఇంద్రియములను దానే గ్రహించి బాహ్యేంద్రియముల నెల్ల నివర్తింపఁజేసి స్వప్న పదార్థములను వానివాని యదృష్టము కొలఁది సృష్టించి యా స్వప్నపదార్థములను నిజ జ్యోతిచేఁ బ్రకాశింపఁజేసి స్వప్నము నందలి యాలోచనము దానే ప్రకాశింపఁ జేయుచున్నాఁడు. అట్టి నిద్రయందుఁ బురుషుఁడు స్వయంజ్యోతియగుచున్నాడు.

౮-౩-౧౦. నతత్ర ఆనందా ముదః ప్రముదో భవం త్యథానందాన్ముదః ప్రముదః సృజతే; నతత్రరథా నరథయోగా నపంథానో భవం త్యథరథాన్రథయోగాన్ పథః సృజతే. నతత్ర వేశాంతాః పుష్కరిణ్యః స్రవంత్యో భవం త్యథ వేశాంతాః పుష్కరిణీః స్రవంతీః సృజతే సహికర్తా.

అచ్చట ఆనందము ముదము ప్రముదము లేవు. ఆనందము ముదము ప్రమదము సృజింపఁ బడుచున్నవి. అచ్చట (ఆ స్వప్నమందు) రథములు లేవు. గుఱ్ఱములు లేవు. రథము పోవు మార్గములేదు. రథములు వానిగుఱ్ఱములు మార్గము సృజింపబడు చున్నవి. అచ్చట గుంటలులేవు, పుష్కరిణులు లేవు, నదులులేవు, గుంటలు పుష్కరిణులు నదులు సృజింపఁ బడుచున్నవి. వానికిఁ గర్త భగవంతుఁడే.

జీవుఁడు చేసిన పుణ్యపాపముల ఫలము ననుభవింపఁ జేయుటకై భగవంతుఁడు దానికి దానికిఁ దగిన పదార్థముల నప్పటి కప్పుడు సృజించుచున్నాఁడు. కావున స్వప్నమునఁ జూచునవి యసత్యములు గావు.

రెండు గ్రామములు సత్యములైనచో నడిమి పొలిమేర యసత్య మెట్లగును? కొందఱు జీవాత్మయే వీని నెల్ల సృజించుకొనుచున్నాఁ డందురు. కలలందుఁ బ్రియముల వలె నప్రియములు కానవచ్చును గదా. ఎవఁడైనను దన కప్రియము లగువానిని సృజించుకొనునా ? కావున స్వప్నసృష్టికర్త భగవంతుఁడే. సృష్టికార్య మాయనదే కాని జీవునిది కాదు. ముక్తునకే యీ యధికారము లేనపుడు బద్ధజీవున కెం దుండి వచ్చును ? స్వప్నములకు ఫలము గలదని ఛాందోగ్యోపనిషత్తునం దీ శ్లోకము గలదు.

"యదా కర్మసు కామ్యేషు, స్త్రియం స్వప్నేషు పశ్యతి
సమృద్ధిం తత్ర జానీయా, త్తస్మిన్ స్వప్ననిదర్శనే." ఛా. ౫. ౯

ఎప్పుడు కామ్యకర్మములందు స్వప్నమున స్త్రీని జూచునో యప్పుడు వాని కభివృద్ధి గలదని తెలియవలెను.

స్వప్నము లసత్యము లైనచో వానికి ఫలముగలదా? ఫలము గలదని శ్రుతి

చెప్పెనా? ఇట్టులే. "స్వప్నే పురుషం కృష్ణం కృష్ణదంతంచ పశ్యతి, స ఏనం హంతి," ఐ. అర. ౩-౨-౪-౧౭. కలలో నల్లనివానిని నల్లదంతములు గలవానిని చూచెనేని వాడు వానిని జంపును. చూ. బ్రి. సూ. ౩-౨, ౪-౫; జై ౭, ౭-౧. బ్రి-సూ ౩-౨-౮; ౩-౨-౪.

ఇక స్మృతు లేమి చెప్పుచున్నవో చూతము.
స్వప్నాధ్యాయమున బృహస్పతి—
స్వప్నాధ్యాయం ప్రవక్ష్యామి నానాస్వప్నసముచ్చయే
స్వప్నస్తు ప్రథమే యామే సంవత్సర విపాకినం.
ద్వితీయే చాష్టభి ర్మాసై స్త్రిభిర్మాసై స్త్రియామికమ్
చాతుర్థే యామికే స్వప్నే మాసే నైకేన ఫలంభవేత్
అరుణోదయ వేలాయాం దశాహేన ఫలం భవేత్
ఏవం చానుదితే కాలే త్రిరాత్రంతు భవిష్యతి
గవాం దోహనవేలాయాం సద్యః స్వప్నఫలం భవేత్
అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి స్వప్నపుణ్య ఫలం ధ్రువమ్
వాతకం పిత్తకంచైవ చింతితం చానువర్జయేత్
అతిదీర్ఘం దివా దృష్ట్వా స్వప్నం తం పరివర్జయేత్
యస్తు పశ్యతి స్వప్నాంతే రాజానం కుంజరం హయమ్
సువర్ణం వృషభం గావః కుటుంబం తస్య వర్ధతే.
ఆరోహణం గోవృషకుంజరాణాం ప్రాసాద శైలాగ్రవనస్పతీనామ్
విష్ఠానులేపో రుదితం మృతంచ స్వప్నే స్వగమ్యాగమనంచ ధన్యమ్
క్షీరిణం ఫలినం వృక్షమేకాకీ యోఽధిరోహతి
తత్ర తస్య విబుద్ధస్య మృత్యు రిత్యేవ నిర్దిశేత్
యస్తు శ్వేతేన సర్పేణ........దంశితో భుజః
స హాస్తలాభ స్తస్య స్యా దపూర్ణే దశమే దినే
ఉరగో వృశ్చికో వాపి జలూకా దృశ్యతే యది
అవ్యయం చార్థసిద్ధించ పుత్రం తస్య వినిర్దిశేత్
ప్రాసాద శైల మారుహ్య సముద్రం తరతే నరః
అపి దాసకులేజాతః సోఽపి రాజా భవిష్యతి.
యస్తు మధ్యే తటాకస్య భుంక్తే నై ఘృతపాయసమ్
అఖండే పుష్కరే పత్రే తం విద్యా త్పృథివీపతిమ్
బలాకాం కుక్కుటీం క్రౌంచీం లబ్ధ్వా యః ప్రతిబుధ్యతే
సుకులా ల్లభతే కన్యాం భార్యాంచ ప్రియవాదినీమ్ ॥
స్వప్నాధ్యాయము వచించెను. మొదటిజామున వచ్చిన కల సంవత్సరమునకు

తాత్పర్యము.

సీతాదేవిని మన మదరింపలేదా బెదరింపలేదా నిర్బంధింప లేదా మన విషయమున నీమె యెట్లు దయ గల దగును? అనవలదు. మనకు రామునిచే నపాయము సమీపించినది. రావణుండు చావంగానే మనము చేయుచున్న పనికి మనల నయ్యో పాప మని రక్షించు వా రెవరు?

క. ప్రణతిప్రసన్న జానకి, యణుమాత్రంబైన సంది*యము లేదు సుండీ
క్షణదాచరసతులారా, యణుమధ్యను వేడుడీ మ*హాభయ మాపున్. ౭౧౧

అర్థములు. ప్రణతిప్రసన్న = ఈమె నమస్కారముచేతనే సంతోషించునది. క్షణదాచరసతులారా = రాక్షసాంగనలారా! అణుమధ్యను = సూక్ష్మమైన నడుముగలదానిని.

తాత్పర్యము.

ఈమెను నానావిధముల బాధించితిమే, మనయందు దయ దలంచునా యని సందేహింపం బనిలేదు. ఈమె నమస్కార ప్రియురాలు. మన మెన్ని తప్పులు చేసినను నిష్కల్మషమైన బుద్ధితో క్షమింపు మని వేడుచు నమస్కరించితిమేని శాంతి వహించి మనల నవశ్యము రక్షించును. మనకు రాంగల మహాపాయమును నీమె తప్పం బాపువా రెవ్వరును లేరు.

"ప్రాయశ్చిత్త ప్రసంగేషు, సర్వపాప సముద్భవే
మా మేకాం దేవదేవస్య, మహిషీం శరణం వ్రజేత్॥"

సర్వపాపములు చేసి ప్రాయశ్చిత్తము పెట్టుకొనవలసి వచ్చినప్పుడు దేవదేవ మహిషినైన నన్ను శరణము పొందవలెను. "సర్వకామప్రదాం రమ్యాం, సంసారార్ణవ తారిణీం, క్షిప్ర ప్రసాదినీం లక్ష్మీం శరణ్యా మనుచింతయేత్॥" సమస్త కాంక్షల నిచ్చునదియు, మనోజ్ఞమైనదియు, సంసారసముద్రమును దాటించునదియు, శీఘ్రముగ ననుగ్రహించునదియు నగు లక్ష్మీదేవిని శరణు చొర నర్హ యగు రక్షకురాలిని ధ్యానింపవలెను, అను వాక్యములు స్మరింప నగు.

క. లక్షించి చూడఁగా నవ,లక్షణ మొక్కటైన లేదు * లలితాంగి విశా
లాక్షికి మెయిఁ గాన వల్లభ,సాక్షాత్కారంబు గలుగు * జలజాక్షి కెటున్. ౭౧౨

అర్థములు. అవలక్షణము = చెడు చిహ్నము, సీతాదేవి బాగుపడఁగల దనుటకు రెండవ కారణము చెప్పుచున్నది.

తాత్పర్యము.

కల యటుండ నిండు. ఈమె దేహచిహ్నములం బరీక్షించి చూచినను నీమెకు శాశ్వతముగం బతి వియోగము గలదని తెలుపు చెడు చిహ్న మొక్కటియైన లేదు. కావున భర్త యీమెకు సాక్షాత్కరింపం గలఁడు.

క. కేవలము వన్నె మాయుట,చే వనటం బడె నటంచు • సెంకించితి నీ
దేవి యదుఃఖార్హయ యగు, గావున దివ్యసుఖములను • గలదు భుజింపన్. ౨౧౩

అర్థములు. సెంకించితిన్ = సందేహించితిని. అదుఃఖార్హయ = దుఃఖపడ యోగ్యురాలు కాదు.

తాత్పర్యము.

ఈమె దుఃఖముచేఁ గాంతి మాయుటచే నీమె భర్తను బాసి దుఃఖ మనుభవించుచున్నదేమో యని సందేహించితిని గాని యీమె దుఃఖంప నర్హురాలు గాదు. ఈమె దివ్యసుఖముల ననుభవింపఁ గలదు. సందర్భము లట్లుండుటచే నీమెను నిష్కారణముగ బాధించి నేనుక మన మేల బాధపడవలెను. ఈమెను బాధించుట వలన మనకు రాఁగల లాభమేమి? ముఖకాంతి మాయుట కష్టదశను దెలుపును.

ఉ. అని యది కంటిరే జలరు•హాయతపత్రమువోలి నిక్కులిన్
గదలెడి వామలోచనము • తొన్నసుదతికిం బ్రియసూచకంబు నై
సుదతికిఁ గార్యసిద్ధియును • పౌలస్త్యతేనికి నాశనంబు దు
ర్మదపరకాలుఁ డైన రఘు•రామునకు న్విజయంబుఁ దెల్పుచున్. ౨౧౪

అర్థములు. జలరుహాయత పత్రము = కమలము యొక్క దీర్ఘమైన రేకు, వామలోచనము = ఎడమ కన్ను, ప్రియసూచకంబునై = మేలు సూచించునదై, పౌలస్త్య తేనికి = రాక్షస రాజగు రావణునకు, దుర్మద పరకాలుఁడు = చెడు గర్వము గల శత్రువుల పాలిటికి యముఁడైన వాఁడు.

తాత్పర్యము.

నా మాట యసత్యమేమో ప్రత్యక్షముగఁ జూడుఁడు. అదిగో నదిగో నామె యెడమకన్ను నిడివి తామరరేకు వంటిది నెట్లదరుచున్నదో చూడుఁడు. అది యామెకు మేలు సూచించు చున్నది. ఈమె కోరిన కార్యము భర్తసమాగమము సిద్ధించును. రావణాసురునకు వినాశము, మదించిన శత్రువులపాలికి యముఁడైన రామచంద్రమూర్తికి గెలుపు తెలుపుచున్నది. స్త్రీల కెడమ కన్నదరుట శుభ సూచకము. ఇది మూడవ కారణము.

క. ఆకస్మికముగ జానకి, వాకేల్ పులకించి వడకె • వామలిదన శుం
డాకారోరు వదరుచును, గాకుత్స్థపురస్థితిం బ్ర•కాశము జేసెన్. ౨౧౫

అర్థములు. ఆకస్మికముగన్ = ఉన్నట్టులుండి, వాకేలు = ఎడమచేయి, పులకించి = గగ్గురు పొడిచి, వామలిదన = ఎడమప్రక్కన, శుండాకార = ఏనుగు తొండమువలె నున్న, ఊరువు = తొడ, కాకుత్స్థ పురస్థితిన్ = రామచంద్రమూర్తి సమీపమందే యుండుట.

తాత్పర్యము.

ఉన్నట్టులుండి సీతాదేవి యెడమచేయి గగ్గురు పొడిచి యదరెను. ఎడమతొడ

యుదరెను. దీనివలన రామచంద్రమూర్తి సమీపమునందే యున్నాఁడనుట సిద్ధము.

చం. నెలకొని శాఖలందుఁ గడు•నెమ్మది నుత్తమసాంత్వవాదియై
వెలసెడి పక్షి పల్కుచును• వెండియు వెండియు స్వాగతోక్తిఁ బే
ర్కొలుపుచు నెడి నెండియును•ప్రేరణ చేసెడునట్లు గ్రాలెడున్
పల దిక వీందు నిల్చి యతి•వన్ వ్యథ పెట్టఁగఁ బొందు దవ్వగన్. ౭౧౬

అర్థములు. ముందు లేచకఁ గల వచ్చెనని చెప్పెను. దాని కనుగుణముగా సాముద్రిక చిహ్నములను శుభశకునములను తెప్పెను. ఇఁక నంతకంటె బహిరంగమైన శకునము చెప్పుచున్నది. శాఖలందు నెలకొని, కడునెమ్మిగన్=మిక్కిలి సంతోషముతో, వెండియు వెండియున్ = మరల మరల, పలుమఱు; ఉత్తమ సాంత్వవాదియై = మిక్కిలి మధురముగఁ బలుకుచున్నదై, పక్షి = పైఁడికంటి పక్షి, స్వాగతోక్తిన్ = స్వ + అగత + ఉక్తిన్ = స్వ = బంధువులయొక్క, 'బంధుస్వస్వజనాసమా'యని యమరము. బంధువు రాకను సూచించి మాటను, పేరెలుపుచు= మిక్కిలి సంతోషముతో, నెండి వెండియును = మాటి మాటికిని, ప్రేరణ చేసెడునట్లు = సీతాదేవిని ప్రేరేపించుచున్నదో యను నట్లు, రాముని కథను చెప్పుచున్నట్లు, గ్రాలెడిన్ = ఒప్పుచున్నది. కావున నో రాక్షసస్త్రీలారా! మీరు దిచ్చుట నుండి యీమెను బాధపెట్టవలదు. మారకుపొందు. ఇది నాల్గవకారణము.

(౨) శాఖలందున్ = చిగిరించి పూచియున్న కొమ్మలందు, ఇట్టివే శాఖలనఁబడును. నెలకొని=నెలవుకొని= స్థిరముగాఁ గూర్చుండి, కడు నెమ్మిగన్= ఫలాదులఁ దినుటచే మిగుల సంతోషముగ. ఉత్తమ సాంత్వవాదియై వెలసెడి పక్షి, పక్షి = గొప్ప ఱెక్కలు గలది. పక్ష+ఇ=పక్షి. ప్రశంసార్థమున మత్వర్థీయము. 'భూమనిందాప్రశంసాసు। నిత్యయోగేతిశాయినే। సంసర్గేస్తి వివక్షాయాం। భవంతి మతుబాదయః'' అను ప్రమాణమును గ్రహించునది. అనఁగా ఱెక్కలు విచ్చి యాకసమున గుండ్రముగఁ దిరుగుచుండిన గరుత్మంతుఁడు - గరుడపక్షి యాకాశమునఁ జక్రాకారముగఁ బ్రదక్షిణముగఁ దిరుగుటయుఁ బచ్చికొమ్మపై స్థిరముగఁ గూర్చుండుటయు ఫలాదుల భక్షించుచు సంతోషముగా నుండుటయు శుభసూచకములు. కావుననే యుత్తమసాంత్వవాదియై వెలసెను నట్లున్నది. పైనున్న యట్లను పదము వలసిన చోటుల నెల్ల నన్వయించును. ఉత్తమ సాంత్వవాది = నీ భర్త శీఘ్రముగా వచ్చును, ఇది దుఃఖపడవలసిన కాలముగాదు, కావున దుఃఖపడవలదు, అని యూఱట మాట లాడుచున్నది. స్వాగతోక్తిని వెండి వెండియుఁ బల్కుచును- నీ భర్త దుఃఖము నీ దుఃఖ మంత్రమాత్రమే కాదు. ఇంతకంటె నెంతయో యధికము అని పలుమాఱు చెప్పుచున్నట్లు విరహులకుఁ జెప్పెడి స్వాగతోక్తి భర్త సంతాపాతిశయమును చెప్పుటయే యని యెఱుఁగవలెను. కాఁబట్టియే కదా కాళిదాసుఁడు. "తపతి తనుగాత్రి మదన స్త్వామనిశం మాం పునర్దహత్యేవ, గ్లపయతి

నిది ధ్యానము అనియెడి యనుష్ఠానములు కలిగి "ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ, సదా మంత్రాశ్రయ శ్శుచిః, గురుభక్తి సమాయుక్తః పురాణజ్ఞో విశేషతః, ఏవం లక్షణసంపన్నో గురురిత్యభిధీయతే" అనియాచార్య లక్షణము. అనఁగా జ్ఞానముగలవాఁడును విష్ణుభక్తి గలవాఁడును మాత్సర్యము లేని వాఁడును, మంత్రార్థము తెలిసినవాఁడును, ఆ మంత్రమందు భక్తి గలవాఁడును, సర్వదా మంత్రము నాశ్రయించి యుండువాఁడును అనఁగా మంత్రార్థ మనుసంధానము చేయుచు నాప్రకారము వర్తించువాఁడును, లోపల వెలుపలఁ గామినీ కాంచనాదుల యెడల శుచిగా నుండువాఁడును, గురుభక్తి గలవాఁడును, పురాణజ్ఞానము విశేషించి గల వాఁడును, శాస్త్రములఁ జదివి తాఁ నాప్రకారముగ నాచరించుచు శిష్యులచేనాచరింపఁ జేయువాఁడు నగు వాఁడు గురువనఁబడును. ఇట్టి యాచార్యలక్షణ మీ పదముచే జెప్పినట్లయ్యెను. కను నెమ్మిగన్ = సదా సంతోషముతో నుండు నని భావము. ఇట్టి యాచార్యుఁడుగదా భక్తులచే సదా సేవ్యుఁడు. "అహ్లాదశీతనేత్రాంబుః పులకీకృత గాత్రవాన్ సదా పరగుణావిష్టో ద్రష్టవ్య స్సర్వదేహిభిః" ఆచార్యుఁడు సర్వదా సంతోషముచేఁ జల్లని యానందబాష్పములు గలవాఁడును, పులకరించిన దేహము గలవాఁడును, ఎల్లప్పుడును పరమాత్మ గుణములను ధ్యానించుచుండువాఁడును నగువానిని గురువుగ నందఱు చూడవలెను. ఆచార్యుఁ డిట్టి సంతోషము గలవాఁడై యుండ వలెను. రెండి రెండియును ఉత్తమ సాంత్వవాది - ఉత్తమ = "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః" భ. గీ. ప్రకృతి జీవులకంటె - బద్ధాత్మ ముక్తాత్మలకంటె నుత్తమ పురుషుఁడు పరమాత్మ యని చెప్పఁబడును, అన్నట్లు పర మాత్మను గుఱించి సాంత్వవాది = మంచి మాటలను శిష్యులకుఁ జెప్పువాఁడు. "త్వం మే హం మే, కుత స్తత్తదపి కుత ఇదం వేదమూల ప్రమాణా దేతచ్చానాది సిద్ధా దనుభవ విభవా త్తర్హి సాక్రోశఏవ । క్వాక్రోశః ? కస్య ? గీతాదిషు మమ విదితః కోత్రసాక్షీ ? సుధీస్స్యాద్ధన్త త్వత్పక్షపాతీ స ఇతి నృ కలహే మృగ్య మధ్యస్థవ త్త్వ"మ్మని పూర్వాచార్యులు చెప్పినట్లు జీవ పరమాత్మలకు స్వాతంత్ర్య వివాదము కలిగినప్పుడు "యమో వై వస్వతో రాజా యస్తవైష హృది స్థితః తేనచే దవివాద స్తే మా గంగాం మాకురూన్ గమః" మనుస్మృతి. అనఁగా సర్వము సంయమించు వాఁడగుటచే యముఁడనియు దండించువాఁడగుటచే వైవస్వతుఁడనియు రంజించువాఁడగుటచే రాజనియుఁ జెప్పఁబడి నీ హృదయము నందు పరమాత్మతో నీకు వివాదము లేదేని అనఁగా నాత్మవంచనము లేక సత్య మందుఁ బ్రవర్తించెదవేని గంగకుఁ బోవలసిన పనిలేదు. కురుక్షేత్రమునకుఁ బోవల సిన పనిలేదు. అంతరాత్మ కనుకూలముగ త్రికరణశుద్ధిగఁ బనులు చేయువాఁడు దన పాపములను బోఁగొట్టుకొనుటకు గంగాది స్నానములకై పోవలసిన పనిలేదు. వాని యందుఁ బాపలవము లేదు. కావున నంతరాత్మకు విరోధముగా వర్తించు వాఁ డెన్నఁ-డ

"ఆచార్యాణా మనా వసా విత్యాథగవత్త్రి"యని శ్రుతి చెప్పినట్లు గురుపరంపరాను సంధానము తప్పక చేయవలె ననుట దీనిచేత సూచితము.

వెండి వెండియును ప్రేరణ చేసినట్లు ప్రాలెకిన్ = తా నుపదేశించిన దానిని అనుష్ఠింపక బలుమారు శిష్యుని నాచార్యుఁడు ప్రేరించు నని భావము. అట్లు లేదు చేయనిచోఁ దాను చేసిన యుపదేశము వ్యర్థమగునుగదా. దీని ననుసరించియే 'స్థాణిత్యే శాసితార'మ్మని స్థలనము కలిగినపుడు శాసించు వాఁడని గురులక్షణము చెప్పఁబడెను. ఇది తన లాభమనియే గురు డెంచవలయును, అని మీరలను నను పదము సూచించును.

తా త్ప ర్య ము.

కొమ్మలందుఁగూర్చుండి మిక్కిలి సంతోషముతో మేలగు నూరార్పు మాటలు పక్షి చెప్పుచు మిూఁద మిూఁద శుభమును దెలిపెడి పలుకులను బలుకుచు నిండు సంతోషముతో స్థైర్యము కలిగి యుండఁ బ్రేరించుచున్న ట్లొప్పుచున్నది. దీనివలన సీతాదేవికిఁ కేవల సమీపకాలమందే శుభము కలుగఁగలదు. కావున విూరించుమండి యామెను బాధింపవలదు. లేచి మూరముగాఁబొండు. ఆమెను నిర్భయముగా నుండనిండు. అనఁగా వారందఱు వప్పిచేసిరి. ఇచ్చట నా రాక్షస స్త్రీలు సీతాదేవి శరణు జొచ్చిరి. ఆమె రక్షించెదనని యభయమిచ్చెను. ఈ విషయ మిచ్చటఁ జెప్పఁబడలేదు. సీతాదేవి గుణమ్మాహాత్మ్యము వానరులకుఁ దెలియఁ జెప్పుట యావశ్యకము, గావున హనుమంతుఁడు వానరులతో మాటలాడు సమయమున నిది యాయన చెప్పెను. రెండుస్థలము లందొక విషయము చెప్పుట వ్యర్థమని వాల్మీకి ముఖ్యమైన చోటఁ జెప్పెను.

—{ ౩౦-వ సర్గము సీతాదేవి శ్రీరాముడు రాదుకి యనేకవిధములఁ బరితపించుట. }—

మత్తకోకిలము. క్రూరుఁడై న దశాస్యురాజ్ఞను • ఘోరరాక్షసకామినుల్
దారుణంబుగ నప్రియంబులు • దన్ను పలుకుచు నుంటకన్
భారతీసుత కాననో మృగ • నాథు బారిని బడ్డ యా
వారణేంద్రుని కన్యకీతివి • బాధకంపిత గాత్రయై. ౭౧౭

తా త్ప ర్య ము.

దయలేని రావణాసురుని యాజ్ఞాప్రకారము రాక్షసస్త్రీలు తిన్న వినరాని మాట లనుచుండఁగా సీతాదేవి యడవిలో సింహము బారిని బడ్డ యేనుఁగు పిల్లవలె దిగులు వణఁకుచున్న దేహము గలదై.

మత్తకోకిలము. ర స జ జ భ ర-పదునొకండవ స్థానంబున యతి.

మత్తకోకిలము. రాక్షసాంగన లెల్లఁ జుట్టును • గ్రాలి భీషణనేమ లై
రూక్షభాషల బాధపెట్టఁగ • రోషదూషితఁ లైన యా

రాక్షసాధిపు తర్జనంబుల • రామకామిని కాన సం
రక్షకచ్యుత యైన బాలిక • రాఁగ దా విలపించుచున్. ౨౧౭

తాత్పర్యము.

రాక్షస స్త్రీలందఱు చుట్టుకొని భయంకరాకారములతోఁ గఠిన వాక్యముల చేతను, కోపముచే మనస్సు చెడిన రావణాసురుని బెదరింపుమాటలకును రామచంద్ర మూర్తి దేవి సీత యడవిలోఁ గాపాడువారు లేని యాఁడుపిల్లవలె నేడ్చెను.

పంచచామరము. అకాలమందు మృత్యు వబ్బ • దంచు పెద్ద లెల్ల నా
ప్రకారమే యథార్థ మయ్యెఁ • బ్రాణమేగ దయ్యెరో
నికారరీతిఁ దెచ్చి క్రుచ్చి • నిష్ఠురంబు లాడఁగన్
వికారరాక్షసీజనంబు • నే నదెంత పాపనో. ౨౧౮

అర్థములు. నికారరీతిన్ = మోసపువిధముగ.

తాత్పర్యము.

విధి నియమించిన కాలము వచ్చునంతకుఁ బ్రాణముపోదని పెద్దలు చెప్పుదురు. ఆ మాటయే నా విషయమున నిజమయ్యెను. కాలము రాలేదు. గనుక నే ప్రాణము పోవలసినంత స్థితి వచ్చినను నది పోలేదు. రావణాసురుఁడు మోసపువిధముగా నన్నుఁ దెచ్చి వికారాకారములు గల రాక్షసుల కఠిన వాక్కుల నన్నుఁబొడిచి బాధించుటకు నే నెంత పాపము చేసితినో.

పంచచామరము. జర జర జగగణంబులు, తొమ్మిదింట యతి. దీనిలో మొదటి హల్లు తొలఁగించిన సుగంధి యగును.

మత్తకోకిలము. అక్కటా! కఱ వాసె సౌఖ్యము • నైకదుస్సహదుఃఖముల్
పెక్కు లాయెను, వజ్రపాతవి•భిన్నశృంగమునట్టు లై
నొక్క వే శకలంబు లై చన•దుల్ల మింతయుఁ జూడఁగా
నిక్క మీ హృదయంబు నాశిల • నేర దెన్నఁడు నైనమా! ౨౨౦

అర్థములు. నైక = అనేకములయిన, దుస్సహ = సహింపరాని, వజ్రపాత= వజ్రము పడుటచే, విభిన్న = పగిలిన, శృంగమునట్టులై = పర్వత శిఖరమువలె, వే= వేయి, శకలంబులు=తునకలు, ఉల్లము=హృదయము.

తాత్పర్యము.

అయ్యో! సౌఖ్యమా కఱవాయెను. సహింపరాని దుఃఖములా యనేకము లయ్యెను. వజ్రముపడిన కొండ శిఖరము పగిలి తునుక లగునట్లు నా హృదయమా వేయితునుకలై పోదు. ఇదంతయుఁ జూడఁగా నా హృదయమునకు నాశన మనునది లేదు.

చర్య మత్యంతముఁ బూనుట=బ్రహ్మచర్యము రెండువిధములు. గృహస్థుఁడు ఋతు కాలమందు మాత్రము తన భార్యతో సంగమించి తక్కిన దినములందు స్త్రీసాంగత్యము మానువాఁడు.

"ఋతు స్స్వాభావిక స్త్రీణాం, రాత్రయ ష్షోడశః స్మృతాః
చతుర్భి రితరై స్సార్థ మహోభి స్సద్విగర్హితైః
తాసా మాద్యా శ్చతస్రస్తు నిందితైకాదశీ చ యా
త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః.

స్త్రీకి రజోదర్శనమైనది మొదలు పదునాఱుదినములు ఋతుకాల మనఁ బడును. వానిలో మొదటి నాలుగురాత్రులు నిషిద్ధములు పదునొకండవ రాత్రి పదుమూఁడవ రాత్రియుఁ బనికిరావు. తక్కిన పదిదినములందు ఏకాదశీ అమావాస్య పున్నమ పితృదినములు వదలవలయును. తక్కినదినములు ప్రశస్తములు. ఋతుకాల మందు భార్యాభర్త లారోగ్యవంతులై యుండి దానిని వ్యర్థముచేసిరేని భ్రూణ హత్యాదోషము వచ్చును. ఇది ముగ్గురుకొడుకులు గలుగువఱకేకాని యావల నీ నియమములేదు. ఆవల భార్యను చెల్లెలివలెఁ జూడవలయును. పరస్త్రీలను దల్లులవలెఁ జూడవలెను.

"యుగ్మాసు పుత్రా జాయంతే, స్త్రియో యుగ్మాసు రాత్రిషు
పుమాన్ పుంసోధికే శుక్లే స్త్రీ భవత్యధికే స్త్రియాః
సమే పుమాన్ పుంస్త్రియౌ వా క్షీణేల్పే చ విపర్యయః
యది సంయోగకాలేతు పురుషో రాగమోహితః
ద్విధా సముత్సృజే చ్ఛుక్లం యమకం తత్ర జాయతే॥

సరిదినములయందుఁ గూడిన పుత్రులును, బేసిదినములయందుఁ బుత్రికలును గలుగుదురు. పురుషుని వీర్యము అధికమైన పుత్రుఁడును స్త్రీ యార్తవ మధికమైన స్త్రీయును రెండును సమత్వమును జెందిన నపుంసకుఁడు గాని స్త్రీ పురుషులు గాని గలుగుదురు. సంభోగకాలమునఁ బురుషుఁడు రాగమోహితుఁడై శుక్రమును రెండు విధములుగ విడిచినఁ గవలు పుట్టుదురు.

శ్లో॥ రాత్రౌ చతుర్థ్యాం పుత్త్రస్స్యా దల్పాయు ర్ధనవర్జితః
పంచమ్యాం పుత్రిణీ నారీ షష్ఠ్యాం పుత్రస్తు మధ్యమః
సప్తమ్యా మప్రజా యోషి దష్టమ్యా మీశ్వర స్సుతః
నవమ్యాం సుభగా సాధ్వీ దశమ్యాం చ వరః పుమాన్
ఏకాదశ్యా మధర్మ్యా స్త్రీ ద్వాదశ్యాం పురుషోత్తమః
త్రయోదశ్యాం సుతా లోకవర్ణ సంకర కారిణీ
ధర్మవిచ్చ కృతజ్ఞస్స్యా దాత్మవేదీ దృఢవ్రతః
ప్రజాయతే చతుర్దశ్యాం సుతోహ్యై జగతీపతిః

రాజపత్నీ మహాభోగా రాజవంశగతాథవా
జాయతే పంచదశ్యాంతు బహుపుత్రా పతివ్రతా
విద్యాలక్షణ సంపన్న స్సత్యవాదీ జితేంద్రియః
ఆశ్రయ స్సర్వ భూతానాం జాయతే షోడశే పుమాన్ ॥

తాత్పర్యము.

నాలవ దినము రాత్రి పురుషునిఁ జేరిన యెడల అల్పాయువు ధన హీనుఁడు నగు పుత్రుఁడును, ౫వ దినము రాత్రి పుత్రినతియగు కూఁతురును, ఆఱవ దినము రాత్రియందు మధ్యముఁడగు పుత్రుఁడును, ఏడవ దినము రాత్రి సంతానహీనురా లగు పుత్రికయు, ఎనిమిదవ దినమున ప్రభువగు పుత్రుఁడును, తొమ్మిదవ దినమున పతివ్రతయగు పుత్రికయు, పదియవ దినమున శ్రేష్ఠుఁడగు పుత్రుఁడును, పదునొకం డవ దినమున అధర్మురాలగు పుత్రికయు, పండ్రెండవ దినమున పురుషోత్తముఁడగు పుత్రుఁడును, పదుమూఁడవ దినమున వర్ణసంకరురాలగు పుత్రికయు, పదునాలవ దినమున ధర్మవేత్తయు, కృతజ్ఞుఁడును, ఆత్మవేదియు, దృఢవ్రతుఁడును, సుగుణములు గలవాఁడును భూభర్తయు నగు కొడుకును గలుగుదురు. పదునేనవ దినమున రాజపత్నియు పతివ్రతయు రాజవంశమును పొందునదియు శ్రేష్ఠురాలును పుత్రులు గలదియు నగు పుత్రికయు, పదియాఱవదినంబున విద్యాలక్షణ సంపన్నుండును సత్య వాదియు జితేంద్రియుఁడును సర్వభూతాశ్రయుఁడు నగు పుత్రుఁడు గలుగును.

ఋతుకాలమందు మాత్రము స్వభార్యతో సంగమించుట యొకవిధమైన బ్రహ్మచర్యము. రెండవది స్త్రీసంభోగమునే మానుట.

"ప్రేమాభిలాషౌ రాగశ్చ, స్నేహః ప్రేమరతి స్తథా
శృంగారశ్చేతి సంభోగ స్సప్తావస్థః ప్రకీర్తితః.

ప్రేమ - అభిలాష - రాగము - స్నేహము - ప్రేమము - రతి - శృంగారము అని సంభోగ మేడువిధములు.

"ప్రేమా దిదృక్షారమ్యేషు, తచ్చింతా త్వభిలాషకః
రాగ స్తత్సంగబుద్ధిస్స్యాత్, స్నేహ స్తత్ప్రవణా క్రియా
తద్వియోగాసహం ప్రేమ, రతి స్తత్సహవర్తనం
శృంగార స్తత్సమంక్రీడా, సంభోగ స్సప్తధా మతః.

అందగత్తెలఁ జూడవలయు నను కోరిక ప్రేమ యనఁబడును. ఆ విషయమైన చింత యభిలాష. అట్టివారితో సంగమింపవలయు నను బుద్ధి రాగము. వారియందే మనస్సుంచుట స్నేహము. అట్టివారిని విడిచి యుండలేకుండుట ప్రేమ. వారితోడ గలసి మెలసి తిరుగుట రతి. వారితోడఁ గ్రీడించుట శృంగారము. ఈయేడును సంభోగ మనఁబడును. స్త్రీలతో నొంటిపాటున మాటలాడుటగాని, వారిచేఁ దల దువ్వించు కొనుటగాని, తలంటించుకొనుటగాని, వారిని స్పృశించుటగాని, వారు తలదువ్వుకొను

వస్త్రము ధరించినపుడు స్నానముచేయునపుడు చూచుటగాని యిట్టివి నిషిద్ధములు. వయస్సు స్త్రీలను పీనుఁగులవలె నైనఁ జూడవలె, లేదా వారి నొద్ద ౫ - ౬ సంవత్స రాలుపిల్లవలె నుండవలె. ఇట్టిది రెండవ బ్రహ్మచర్యవిధము. ఇట్టి బ్రహ్మచర్యవ్రతము రామచంద్రమూర్తి యందు విశేషించి గలదు. సమస్త సద్విధుల్ = అన్ని వైదిక కర్మవిధానములు, సముపాసిత విప్రుఁడు = బ్రాహ్మణుల సేవించినవాఁడు, రాజవిద్య లందున్ = ఆన్వీక్షికి - త్రయీ - వార్త - దండనీతి యను నాలుగు రాజవిద్యలు.

"ఆన్వీక్షికీ త్రయీ వార్తా దండనీతిశ్చ శాశ్వతీ
ఏతావిద్యా శ్చతస్రస్తు లోకసంస్థితిహేతవః॥" అని ప్రమాణము.

ఆన్వీక్షికి = తర్కవిద్య, త్రయి = మూఁడు వేదములు, వార్త = వాణిజ్యాదికము, దండము = దోషుల దండించుట. లోకస్థితి యీ నాలుగింటిపై నాధారపడి యున్నది. శీలధనుఁడు = సదాచార పరాయణుఁడు.

## తాత్పర్యము.

కాంతిగలవాఁడు, సాధు పూజితుఁడు, తీవ్రమైన బ్రహ్మచర్యనిష్ఠ గలవాఁడు, సాధువులకు నాయన తప్ప వేఱు ప్రాపు లేదు. సమస్త వైదిక కర్మవిధానము తుద ముట్టఁ బూర్ణముగ నెఱుఁగును. బ్రాహ్మణోపాస్తి గలవాఁడు, రాజవిద్యలందు మిగుల సమర్థుఁడు. సదాచారసంపత్తి గలవాఁడు. అందఱి విషయమున నీతితోఁ గూడిన ప్రవర్తనము గలవాఁడు.

తే. వేదవేదాంగముల యజుః ర్వేదమునను, విల్లువిద్యను నిపుణుండు విపులము లగు
వంసములుఁవాఁడు దీర్ఘబాహో విరాజి, యబ్జకంఠుఁడు ముఖము రా కాబ్జసఖము.

## తాత్పర్యము.

ఋగ్వేదము సామవేదము అధర్వణము లను వేదములను, వేదాంగము లగు శిక్ష వ్యాకరణము ఛందస్సు నిరుక్తము జ్యోతిషము కల్పము నను వానిని, యజుర్వేదమును, ధనుర్వేదమునందును,నిపుణుఁడు.ఇంతవఱకు నాత్మగుణములు ఇఁక దేహగుణములు చెప్పెద వినుము. వెడల్పుగల మూఁపులు.గలవాఁడు,నిడుపులగు బాహువులచేఁ బ్రకాశించువాఁడు, శంఖమువంటి కంఠముగలవాఁడు. ముఖము పూర్ణచంద్రునితో సమానము. ఇందు యజుర్వేదమును బ్రత్యేకించి చెప్పుటచే రామచంద్రమూర్తి యజుశ్శాఖీ యని తెలియ నగు.

ఆ. తామ్రలోచనుండు • తతగూఢజత్రుండు, దుందుభిస్వనుండు • తోయజాక్షి,
బల్లిదుండు స్నిగ్ధ•వర్ణుండు చాపవిద్యావాఁడు సింహ•సంహననుఁడు. ౮౨౩

అర్థములు. తామ్రలోచనుండు = ఎఱ్ఱ కమలమువంటి కన్నులు గలవాఁడు, తతగూఢజత్రుండు=మూఁపులు బలిసియుండుటచే వెలుపలికిఁ దెలియరాని మూఁపుల సంధి యెముక గలవాఁడు, దుందుభిస్వనుండు=భేరివంటి కంఠధ్వని గలవాఁడు, బల్లిదుండు=మిగుల బలిష్ఠుఁడు, బల్లిదాదులు సంస్కృత తుల్యములు గావున బల్లిదము

బల్లిదుఁడు బల్లిదె యని రూపంబులు. ఇవి విశేష్య నిఘ్నములు, స్నిగ్ధవర్ణుఁడు=మిస మిస మను దేహకాంతి గలవాఁడు,—చామనచాయవాఁడు చామనము+చాయ = వృత్తియందు ప్రత్యయలోపము. బొగ్గువలె నలుపుగాక తెలుపుగాక మేఘ వర్ణము వంటి చాయ గలవాఁడు. సింహసంహననుఁడు=సౌందర్యముతోఁగూడి సౌష్ఠవమైన ప్రత్యవయవము గలవాఁడు. 'వరాంగరూపోపేతో యస్సింహసంహననో హి సః' అనురకోశము. ఏ యే యవయవ మెంతె పరిమాణముండవలయునో యంతే పరిమాణముగల యవయవములు గలవాఁడు.

తాత్పర్యము.

ఎఱ్ఱని కన్నులు, వ్రేఁగిన మూఁడు సంధి కొనుములు, భేరివంటి గంభీరధ్వని గలవాఁడు, బలిష్ఠుఁడు, మిసమిసమెఱయు దేహకాంతి గలవాఁడు, మేఘ వర్ణమువంటి దేహవర్ణము గలవాఁడు, అవయవ సౌష్ఠవము గలవాఁడు.

సీ. సమవిభక్తాంగుండు • సముఁడు త్రితామ్రుండు, త్రిప్రలంబుండును • త్రిస్థిరుండు
ముచ్చోట్ల నున్నతి • ముచ్చోట్ల స్నిగ్ధత, ముచ్చోట్ల గాంభీర్య•మును గలండు
త్రివళీవంతుండును•త్రినముండు త్ర్యవనత, త్రికశిరస్కుఁడమ్మ!సీ • హ్రస్వయవిధుఁడు
నాలుగు వ్యంగ్యముల్ • నాలుగు కలలును, నాలుగు రేఖ లం•దంబు మీఱు
ఆ. తెలి! చతుస్సముండు • బలి చతుష్కిష్కుఁడో, యమ్మ మహితనాసి•కోష్ఠహనువు
లమరువాఁడు జంట • లగు పదునాలుగు, సమముగాఁ గలఁడు • జనకతనయ.

అర్థములు. సముఁడు = ఎచ్చుతక్కువలు లేని శరీరము కొలఁత గలవాఁడు, సమవిభక్త+అంగుఁడు = ఒక్కొక్కయంగమును దగినంత కొలఁతతోఁ గలవాఁడు. త్రితామ్రుండు = కన్నుల కొలుకులందును, గోళ్ళయందును, అరచేయి యరకాలియందును నెఱ్ఱని రంగుకలవాఁడు. 'నేత్రాంత నఖ పాణ్యంఘ్రితలైః తామ్రైః శ్రీభిః ఉ శ్రీ' యను వచనము ప్రమాణము. 'స్నిగ్ధాంగుళీ రుచిర తామ్రనఖౌ సుపార్ష్ణి పాదౌ కరా వపి సురక్తనఖాత్మకేతౌ' యనియు నిందుఁ బ్రమాణవచనము. త్రిప్రలంబుండు = రామునికిఁ గనుబొమలు బాహువులు వృషణములును దీర్ఘములైనవి. 'దీర్ఘ భ్రూ బాహుముష్కశ్చ చిరజీవీ ధనీ నరః' యని ప్రమాణ వచనము. త్రిస్థిరుండు = మూఁడు చోటులందు స్థిరమైనవాఁడు. స్థిరమైనరొమ్ము, స్థిరమైన మణికట్టు, స్థిరమైన పిడికిలి కలవాఁడు. "ఉరశ్చ మణిబంధశ్చ ముష్టిశ్చ నృపతేస్థిరాః" యని సాముద్రిక వచనము. ముచ్చోట్లన్ = రొమ్ము. కడుపు, నాభి యంతర్భాగము అను నీ మూఁడు చోట్లయందు. ఉన్నతి = మిట్టగానుండుట కలవాఁడని యన్వయము. "నాభ్యంతః కుక్షి వక్షోభి రున్నతః క్షితిపో భవేత్" ఇతి ప్రమాణవచనము. "ఉన్నతకుక్షిః క్షితిపః పరిమండలోన్నత నాభీ యః క్షితిపః । హృదయం సలోమకం స్పృశ సమోన్నతం మాంసలంచ నృపతీనాం" మ్మనియు వరాహమిహిరవచనము. ముచ్చోటన్ = పాకశేఖలు, తలవెంట్రుకలు, లింగమణి యను నీ మూఁడు చోట్ల

యుండు, స్నిగ్ధత = నునుపు, కలఁడు = కలవాఁడు, "స్నిగ్ధా భవంతి నై యేషాం పాదరేఖా శ్శిరోరుహాః తథా లింగమణి స్తేషాం మహాభాగ్యం వినిర్దిశేత్" అని సాముద్రిక ప్రమాణవచనము. ముచ్ఛ్రితః = స్వరము సత్త్వము నాభి యను మూఁడు చోట్లయందు, గాంభీర్యము కలఁడు = గంభీర స్వరము, లోఁతైన నాభి, గొప్ప సత్త్వము కలవాఁడు. "స్వరే సత్త్వే నాభౌ చ గంభీర స్త్రిషు శస్యతే" యని బ్రహ్మపురాణము.

త్రివళివంతుఁడు = బొడ్డుపైని మూఁడు ముడుతలుగలవాఁడు. (అ) మెడపైన మూఁడు ముడుతలు గలవాఁడు "స్థిరా త్రిరేఖ్యా సుభగోపపన్నా స్నిగ్ధా సుమాంసోపచితా సువృత్తా, నచాతిదీర్ఘా చతురంగుళాచ గ్రీవా సుదీర్ఘా భవతీహ ధన్యా" యని ప్రమాణవచనము. త్రిసముఁడు = వెండ్రుకల కొనలు, మోకాళ్ళు, వృషణములు అని మూఁడును ఎచ్చు తక్కువలులేక సమానములైనవిగాఁ గలవాఁడు. "కేశాగ్రం వృషణం జాను సమా యస్య స భూమిపః" అని వచనము. త్ర్యవనతుఁడు= రొమ్మునందు స్తనభాగము, దాని కొనభాగము, కాలుచేతులయందు రేఖలు అను నీ మూఁడును లోఁతుగానున్నవి రామునకని యర్థము. "పీనోపచితై స్స్నిగ్ధైః క్షితిపతయ శ్చూచుకై స్స్తనైః సుఖినః స్నిగ్ధా నిమ్నా రేఖా ధనినాం తద్వ్యత్యయేన నిస్వానా"మ్మని వరాహమిహిరవాక్యము. త్రిశిరస్కుఁడు = మూఁడు సుడులు గల తలలుగలవాఁడు. "ఆవర్తత్రయరుచిరం యస్య శిర స్స క్షితిభృతాం నేతా" యని ప్రమాణము. మూఁడు తీరులుగల శిరస్సు గలవాఁడు. సమమై గుండ్రమై యుండుట, ఛత్రాకారమై యుండుట, విశాలమైయుండుట యనునవి మూఁడు తీరులు "సమవృత్తశిరాశ్చైవ ఛత్రాకారశిరాస్తథా । ఏకచ్ఛత్రాం మహీం భుంక్తే దీర్ఘమాయుశ్చ విందతి" యని నారద వాక్యము. నాలుగు వ్యంగ్యముల్ = పొట్టివియైన నాలుగవయవములు. మెడ ప్రజననము వీఁపు మోఁకాళ్ళు. ఇవి పొట్టివైన నాల్గవయవములు, నాలుగవయవములు కొన్నిలోపములు గలవి. పాదములందు నరము కనఁబడదు. ఒక రోమకూపమందు రెండు రోమములు మొలవవు. మడగుతి పొడుగుగాక యుండును. వస్తి మాంసహీనము. ఇవియే లోపములు. "పాదైః ప్రస్వేదరహితై స్సిరాహీనశ్చ పార్థివః । ఏకరోమా భవే ద్రాజా ద్విరోమా పండితో భవేత్ । త్రిరోమా చతురోమాచ భవే ద్భాగ్యవివర్జితః । సమపాదోపవిష్టస్య గుల్ఫం స్పృశతి మేహనం । యస్యేశ్వరం తం జానీయా త్స్వజనం చైవ మానవం । నిర్మాంస స్సంహతో వస్తి ర్యేషాం తే సుఖభాగినః" అని నారద వచనము. నాలుగు కలలును = నాలుగు వేదములును. శరీరలక్షణము చెప్పునప్పుడు వేదములను చెప్పుట తన్మూచకములైన రేఖలను దెల్పుటకై యని తెలియునది. "మూలేంగుష్ఠస్య వేదానాం చతస్రస్స్యుః ప్రవహి । ఏకా ద్వేవా యథాయోగం రేఖా జ్ఞేయా ద్విజన్మనా" మ్మని నందవచనము. నాలుగు రేఖలు - నొసలియందును, అఱచేతులయందును,

నడుకాళ్ళ యందును నున్న నాలుగు రేఖలు. "లలాటే యస్య దృశ్యన్తే చతస్రో ద్వ్యేక రేఖకాః। శతద్వయం శతం షష్టి స్తస్యాయు ర్వింశతి స్తథా" యని కాత్యాయన వచనము. "యస్య పాదతలే వజ్రధ్వజ శంఖాంకుశోపమాః। రేఖా స్సమ్య క్ప్రకాశంతే మనుజేంద్రం తమాదిశే" త్తని నారదవచనము. "పాణౌ చతస్రో రేఖాశ్చ యస్య తిష్ఠం త్యభంగురా" యని బ్రహ్మవచనమునిట స్మరించునది. చతుస్సముఃను=భుజములు మోఁకాళ్ళు, తొడలు, చెక్కిళ్ళు అనునవి ఎచ్చు తక్కువలు లేనివాఁడు. (సమానముగాఁ గలవాఁడు.) చెక్కిళ్లకు మాఱుగాఁ పిక్కలని కొంద ఱందురు. "బాహు జానూరు గండాశ్చ చత్వారస్త్వతి సమానిద" యని బ్రహ్మాండ పురాణము. "గండాశ్చ" యన్నచో "జంఘాశ్చ" యనియు పాఠాంతరము. చతుః+కిష్కుఁడు = నాలుగు కిష్కుల కొలఁది గలవాఁడు, కిష్కువు = ఇరువదినాలుగంగుళములు. తొంబది యాఱంగుళముల యెత్తుగలవాఁడని భావము. మహోష్ఠ.........హనువులు. మహోష్ఠ=కొనియాడఁబడిన, నాసిక=ముక్కు, ఓష్ఠ=పెదవి, హనువులు=దవడలు, పెదవులు దొండపండువలె నెఱ్ఱనై బలిసియున్నవి. ముక్కు ఎత్తై పొడ వుగా నున్నది. దవడ లంటుకొనిపోక బలిసియున్నవని భావము. జంట యిత్యాది = జంటగానున్న పదునాలు గవయవములు హెచ్చు తక్కువలులేక యున్నవి. "భ్రువౌ నాసాపుటే నేత్రే కర్ణా ఓష్ఠౌచ చూచుకే కూర్పరౌ మణిబంధౌ చ జానునీ వృషణౌ కటీ। కరౌ పాదౌ స్ఫిచౌ యస్య సమౌ జ్ఞేయ స్స భూపతిః" అని బ్రహ్మాండ పురాణము. "కర్ణాక్షి భ్రూగండ నాసా దంతోష్ఠ స్కంధ జత్రుణీ। పాదౌ కరౌ స్తనౌ పూరూ స్ఫిచౌ ద్వంద్వా శ్చతుర్దశ సమాశ్చయస్య విద్యంతే క్రమేణోపదిశా స్తథా" యని బ్రహ్మాండ పురాణ వాక్యము.

తాత్పర్యము.

ఏ యవయవ మెంతయుండిన నందమో యంతమాత్రమే నేర్పాటుగాఁ దెలియు పళ్లు గలవాఁడు. ఎచ్చు తక్కువలులేని శరీరము కొలఁది గలవాఁడు. ఎఱ్ఱని కనుఁ గొనలు, గోళ్ళు అరచేతులు అరకాళ్ళు గలవాఁడు. కనుబొమ్మలు, వృషణములు, బాహువులు పొడుగుగాఁ గలవాఁడు. బొమ్మ మణికట్టు పిఱికిలి స్థిరముగాఁ గలవాఁడు. ప్రాత్తికడుపు, బొడ్డు, రొమ్ము ఎత్తుగాఁ గలవాఁడు. పాదరేఖలు తలవెంట్రుకలు లింగము నునుపై యుండువాఁడు. గంభీరమైన కంఠధ్వని, నడక లోఁతైన బొడ్డు గల వాఁడు. కంఠమున మూఁడు రేఖలు గలవాఁడు. తలవెంట్రుకలకొనలు, వృషణములు, మోఁకాళ్లు సమముగాఁగలవాఁడు. చను మొనలు స్తనములు రేఖలు పల్లముగాఁ గలవాఁడు. మూఁడు సుళ్లు గల తలగలవాఁడు. కంఠము, లింగము, వీఁపుఁ గులు, పిక్కలు ఇవి హ్రస్వములుగాఁ గలవాఁడు. సమమై గుండ్రమై విశాలముగా నుండుశిరస్సు గలవాఁడు. బొటనవ్రేలిక్రింద వేదముల సూచించు నాలుగు గీఁతలు గలవాఁడు. నొసట నాలుగు రేఖలును, అఱకాలి యందును, అఱచేతియందు,ధ్వజము వజ్రము అంకుశము

శంఖమువంటి నాలుగు రేఖలు కలవాఁడు. బాహువులు మోఁకాళ్లు, పిక్కలు, తొడలు, సమముగాఁ గలవాఁడు. బలశాలి. నాలుగు హస్తము లనఁగాఁ దొంబది యాఱంగుళములు నెత్తుగలవాఁడు. మంకెనపువ్వు రేఁకవంటి పెదవియు, బలిసి యున్న చెక్కిళ్లు, నిడుపై నిక్కి పొడిచిన ముక్కు గలవాఁడు. కనుబొమలు, ముక్కుపుటములు, కన్నులు, వీనులు, పెదవులు, చనుముక్కులు, మోఁచేతులు, మణికట్లు మోఁకాళ్ళు, వృషణములు, కటిప్రదేశములు, చేతులు, కాళ్ళు, పిఱుఁదులు సమానములుగ నుండువాఁడు. ఇట్టి మగవారు లోకమందున్నారా యందువేమో. ఏనికిఁ దగిన చిహ్నములు గల స్త్రీవి నీవొకతెవే యున్నట్లున్నావో, లోకమున నీకుఁదగినట్టి యిట్టి చిహ్నములు గలవాఁ డాయన యొక్కఁడే యున్నాఁడు.

ఉ. నాలుగుప్రక్కదంష్ట్రలును • నాల్గిటియానముఁ గల్గు, నాలుగున్
నాలుగు వంశముల్ గలఁడు • నాలుగు నొక్కటి స్నిగ్ధ, మూఁడునున్
నాలుగు పద్మముల్, మఱియు • నాలుగు నాఱును గొప్ప దొప్పఁగున్
నాలుగు రెండు మిట్టలును • నాలుగు నైదును సన్నమై తగున్. ౧౩౫

అర్థములు. నాలుగుప్రక్క దంష్ట్రలు = పై పండ్లవరుసయందు రెండు ప్రక్కలును, దిగువ పండ్ల వరుసయందు రెండు ప్రక్కలును జేరి నాలుగు ప్రక్కలు. ఆ యొక్కొక్క ప్రక్కయందును నాలుగేసి కోరలవంటి పండ్లు కల్గు నని యన్వయము. (౨) ఈ రెండువరుసలలోను నడుమనుండు నాలుగు పండ్లకు రెండుప్రక్కల యందును నొక్కొక్క పల్లు కలదు. దానికి దంష్ట్ర యని పేరు. అవి నాలుగు ప్రక్కలందును నాలుగున్న వని యర్థము. 'స్నిగ్ధా ఘనాశ్చ దశనా స్సుతీక్ష్ణదంష్ట్రా స్సమాశ్చ శుభా' యని వరాహమిహిరవచనము.

"బంధుజీవ కుసుమోపమోఽధరో । మాంసలో రుచిరబింబ రూపధృత్ । పూర్ణమాంసళహనుస్తు భూమిప స్తుంగతుండ రుచిరాకృతిస్తథా" యని సంహితావచనము. నాల్గిట యానముఁగల్గున్ = సింహశార్దూలగజ వృషభములవంటి నడక గలవాఁడు. "గజసింహ గతీ వీరౌ శార్దూల వృషభోపమౌ" యని బాలకాండ వాక్యము. నాలుగున్ నాలుగు = ఎనిమిది. వంశముల్ = నిడుపైన యవయవములు కలవాఁడు. వెన్నెముక, శరీరము, వ్రేళ్లు, చేతులు, ముక్కు, కన్నులు, చెవులు, మగగుఱి-యివి యెనిమిది యవయవములు. మగగుఱి వంకర కాకుండుటే పొడ వగుట యనుట. 'పృష్ఠవంశ శ్శరీరంచ హస్తపాదాంగుళీ కరౌ, నాసికా చక్షుషీ కర్ణౌ ప్రజనో యస్య చాయతా" యని సాముద్రిక వచనము. (౨) రెండు చేతులు, రెండు చేతుల వ్రేళ్లు, రెండు తొడలు రెండు పిక్కలు చేరి యెనిమిది యవయవము లని కొందఱు. 'బాహూచ నలకౌ చోరూ జంఘే చే త్యష్టవంశకా' యని వచనము. నాలుగు నొక్కటి = అయిదు అవయవములు. అవి వాక్కు, వక్త్రము, నఖములు, రోమములు, త్వక్కు అని కొందఱు. వెండ్రుకలు - కన్నులు - దంతములు - అఱుగులు-

నాధారము చేసికొని చెప్పెను. దానిని గుఱించి హనుమంతుఁడు చెప్పకుండినను నేను జూడలేదు, నాకుఁ దెలియ దని చెప్పియుండినను హనుమంతుఁడు మందబుద్ధి యని సీతాదేవి తలఁచియుండును.

క. రామునిద్వైమాతురుఁ డగు, సౌమిత్రి యజయ్యుఁ డాజి • సద్గుణరూప
ప్రేమముల నట్టివాఁ డు,ర్వ్యామండలి దేవి! నిన్ను • వెదకుచు వారల్. ౮౨౭

అర్థములు. ద్వైమాతురుఁడు = లక్ష్మణుఁడు రామునకు సవతితల్లి కొడుకైనను నిక్కపు నిద్దఱు తల్లుల బిడ్డఁ డని చెప్పఁబడెను. ద్వయో ర్మాత్రో రపత్యం పుమాన్ ద్వైమాతుర యని వ్యుత్పత్తి. "మాతురుత్సంఖ్యాసంభద్రపూర్వాయాః" యని పాణిని. అనఁగా నిద్దఱు తల్లుల బిడ్డఁడు. కన్నతల్లి సుమిత్రవలెనే కౌసల్యాదేవిచే రామునితోడఁ బెంపఁబడుటచే నిద్దఱు తల్లుల కొడుకని చెప్పఁబడెను. రామలక్ష్మణులు నిరువురు నొక్కతల్లి బిడ్డలవలెఁ గలసి మెలసి యున్నారుగాని, సవతితల్లి బిడ్డలని వారిని జూచిన వారు వారి నడవడిఁబట్టి చెప్పఁజాల రని భావము. అజయ్యుఁడు = జయింపరానివాఁడు, ఆజిన్ = యుద్ధమందు, అట్టివాఁడు=రామచంద్రమూర్తి వంటి వాఁడే, వారల్ = రామలక్ష్మణులు.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి సవతితల్లి కొడుకైనను సోదరునివలె నుండువాఁడు లక్ష్మణుఁడు. యుద్ధమున నజయ్యుఁడు, సద్గుణమందు, రూపమందు, ప్రేమమందు, రామునివంటివాఁడు, వా రిరువురు నిన్ను భూమి యంతయు వెదకుచు.

ఇంతవఱకు "ఎట్టిది సంస్థాన మెట్టిది రూపంబు రామున కా సుమిత్రాత్మజునకు" అని సీతాదేవి యడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పి శ్రీరామచంద్రునితో స్నేహ మెట్లు లభించె నీకు, లక్ష్మణు నెట్లు లెఱిఁగితివి, నరవానరుల కెట్లు పరఁగె సమాగమంబు అన్న ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు.

—•సీతాదేవికి హనుమంతుఁడు శ్రీరామసుగ్రీవుల సమాగమ విధంబుఁ జెప్పుట•—

సీ. చనుదెంచి రమ్మ! మా•చరియించుచోటికి, నన్న రాజ్యమునుండి•తన్నుఁ దఱుమ
ఋశ్యమూకాద్రి మే•మెల్లను సేవింప, నన్నభయంబున • నదరిపడుచు
నున్న సుగ్రీవుఁ డి•యున్నదమ్ములఁ జీర,వసనుల ధృతచాప•పాణితలుల
వీక్షించి భయమున • నెగిరి శృంగముఁ జేరి, నను బంపె వారిచెం•తం దెలియఁగ

ఆ. మ్రొక్కుఁ గేలఁ బురుష•ముఖ్యుల డాసితి, వారు నాదు పల్కు • గారవింప
నాచి తెచ్చి కపి•ముఖ్యుని మ్రోలను, లలితరీతి వారి • నిలుపుటయును. ౮౨౮

అర్థములు. మా చరియించు చోటికి=మేము చరించు చోటికి, సమాపంబునఁ బ్రథమమున మప్పి - చీరవసనులన్ = నార చీరలు గట్టిన వారిని, ధృతచాప పాణి తలుల = హస్తములందు విండ్లు ధరించిన వారిని.

లభింపవద్యోఁగదా యని గతతేజుఁడై యుండి, రామచంద్రమూర్తి దుఃఖము జూచి విగతతేజుఁ డయ్యెను.

ఉ. పూర్వము నింట రావణుఁడు • పొల్తుక నిన్ గొనిపోవు వేళ నీ
పుర్విని వైచినట్టి నగ • లొక్కెడ నేఁ బదిలంబు సేసితిన్
సర్వము నల్లు తేర దివ • స ప్రభుమూర్తియుఁ జూచెఁ గాని హృ
త్పర్వము గూర్ప నీ యునికి • పట్టును మాత్ర మెఱుంగ మంగనా ! ౮౩౨

అర్థములు. హృత్పర్వము = హృదయమునకు సంతోషము.

తాత్పర్యము.

పూర్వము రావణాసురుఁడు నిన్ను నాకాశమార్గమునఁ దీసికొని పోవునప్పుడు నీవు భూమిమీఁద వేసిన యాభరణములను నే నొకచోట భద్రపఱిచి యుంటిని. వాని నన్నిటినిఁ దీసికొని రాఁగ సుగ్రీవుఁడు వానిని రామచంద్రమూర్తికిఁ జూపెఁగాని, యాయన మనస్సు సంతోషించునట్లు చెప్పుటకు నీ వెందున్న దానవో మాకుఁ దెలియదు.

కిష్కింధాకాండము ౬ వ సర్గంబున సుగ్రీవుఁడు తెచ్చి చూపిన ట్లున్నది. ఇచ్చట హనుమంతుఁడు తెచ్చిన ట్లున్నది. హనుమంతుఁడు తెచ్చి సుగ్రీవుచేతి కీయఁగా సుగ్రీవుఁడు కనఁబఱచె నని తెలియ నగు.

ఉ. వానిని జేర్చి యంకమున • వారిజలోచన! నీదు భర్త శో
కానలదహ్యమానుఁ డయి • యాభరణాలిని గాంచి కాంచి య
మ్మా! నినుఁ గూర్చి యా వఱచి • న ట్లఱచెన్ వివిధప్రలాపుఁడై,
నేను విచేతనున్ నృపతి • నిమ్మదిఁ దేర్చితి సాంత్వవాక్యలన్. ౮౩౩

అర్థములు. అంకమునన్ = ఒడియందు, శోకానల దహ్యమానుఁ డయి = శోకాగ్నిచే దహింపఁబడిన వాఁడై, అఱ + అఱచినట్లు, విచేతనున్ = స్మృతి తప్పిన వానిని, సాంత్వవాక్యలన్ = ఊరార్పు మాటలచే.

తాత్పర్యము.

ఆ యాభరణములను నొడిలో నుంచుకొని నీ మగఁడు శోకాగ్నిచేఁ గాలిన వాఁడయి వానిని జూచి చూచి, తల్లీ! యూవఱచినట్లు నానా విధముల నేడ్చెను. స్మృతి తప్పిన రామచంద్రుని నేనే మూర్ఛ తేఱునట్లు చేసి యూరార్చితిని.

—• శ్రీరాముని విరహతాపము హనుమంతుఁడు సీతాదేవికిఁ జెప్పుట. •—

ఆ. నగలు చూచి చూచి • నగచరపతి కిచ్చె, మఱల వాని నీదు • మగఁడు దేవి!
నిన్నుఁ బాసి విభుఁడు • నిత్య మగ్నివిధాలు, నగ్నిపర్వతంబు • నటు తపించు. ౮౩౪

ఇంతట రామచంద్రమూర్తి యవయవ సౌందర్యము నచ్చచెప్పి యుప్పొంగు సాముద్రికల విషయముఁ జెప్పి యా నమ్మకమును బలపఱచెను. నగలు చూచిన పిమ్మట

తన విషయమై యుపేక్ష వహించెనా, ప్రేమగలవాఁడై వర్తించెనా యను విషయము సీతాదేవి ముఖ్యముగాఁ దెలియవలసినది. కావున నా విషయము చెప్పుచున్నాఁడు.

తాత్పర్యము.

ఆభరణములను జూచిచూచి మజల రామచంద్రమూర్తి సుగ్రీవున కిచ్చెను. ఓ స్నిగ్ధభాషిణీ నీ మగఁడు సర్వదా లోలోపలనే కుములు నగ్నినిగల యగ్గికొండవలెఁ దపించుచున్నాఁడు.

'అత్రమాల్యవతే శృంగే। దృశ్యతే హవ్యవాట్సదా, నామ్నా సంవర్తకో నామ కాలాగ్ని ర్భరతర్షభ॥ భారత మాల్యవంతమను పర్వత శృంగమున సంవర్తకుఁ డను! నగ్ని సర్వదా కానవచ్చును, అని ప్రమాణము.

క. మగ్నుండై శోకంబున, భగ్నంబుగ నిద్ర చింత • వనరుచు రాముం
దగ్నులచేఁ దపియించెడి, యగ్నిగృహం బనఁగ నున్న•యాతం డబలా! ౪౩౫

లోపల నున్నది నీ కెట్లు తెలిసెను. ఉన్నదో, లేదో లోపల నుండిన నెలు పలికిఁ దెలియదా యందు వేనిచో శోకంబున మునిఁగినవాఁడై నిద్ర భగ్నమైపోఁగా చింతచే దుఃఖించుచు రామచంద్రమూర్తి యగ్నులచే దపించు నగ్నిహోత్ర గృహమువలె నున్నాఁడమ్మా!

తాత్పర్యము.

నిత్యాగ్నిహోత్రు లగు ద్విజుల యిండ్లలో నగ్నిని సంరక్షింప నొకగది దాని కని ప్రత్యేకముగా నుండును. అం దగ్ని యారక మండుచునే యుండును. ఆ కారణమున నాగది సెగలు గ్రక్కుచుండును. ఆ విధముగ నీ మగడు విరహాగ్నిచే సంతప్తుఁ డగుటచే దేహము సెగలు గ్రాఁగినట్లు గ్రాగుచున్నది.

ఉ. కానఁడు సౌఖ్య మేమి నినుఁ • గానని వేదనచేతఁ, దాపముం
మానఁడు, త్వద్వియోగదహ•నంబు దహింపఁగ భూమికంపవే
గాన వణంకుకొండ యనఁ•గాఁ జలియించెడి, సంతసింపఁ డో
మానిని ! నిన్నుఁ బాసి సుమ•మంజులకుంజము లెన్ని చూచినన్. ౪౩౬

అర్థములు. భూమికంపవేగానన్ = భూమివణఁకు వేగముచే, సుమమంజుల కుంజములు = పూవులచే రమ్యములైన పొదలు.

తాత్పర్యము.

నిన్నుఁ జూడలేనను తాపము చేత సౌఖ్యము కొంచెమైనఁ గానఁడు. తాపము వదలఁడు. నీ వియోగవహ్ని దహింపఁగ భూకంపముయొక్క వేగముచే వణఁకు కొండవలె వణఁకుచున్నాఁడు. తల్లీ! నిన్ను నెడఁబాసిన కారణముచే రమ్యము లైన పూఁబొద లెన్ని చూచినను సంతోషింపఁడు.

తే. హృద్యకాంతారముల నెందు • నేగు చున్నఁ
గమలహారితరంగిణుల్ • గాంచు చున్న

సముద్రములో గంగ కలసినను విభజింపరానట్లు కలియునే కాని యొక పరమాణువు మరియొక పరమాణువు కాఁజాలదు. నామ రూపములు మారినను స్వస్వరూప స్వభావములు మారక భేదింపరాని సమత్వదశను సైక్యమని పేరు. సముద్రములు నానా వృక్షముల తేనె లొకచోఁ జేర్చును. మరల దానిని విడదీయ సాధ్యమగునా! అట్టి కూడిక నైక్య మనిపేరు. మేఘ గంభీరభాషణుంబు లన్నప్పుడు మేఘధ్వని మనుష్య నుడి నాను. మేఘధ్వనిని బోలిన ధ్వని యని యర్థము.

తా త్ప ర్య ము.

అధిక తేజము గలవారును భయంకర యుద్ధములందుఁ బండితులును, నగు రామలక్ష్మణులు సుగ్రీవునితోడఁ గిష్కింధకుఁ బోయి వాలిని జంపి సుగ్రీవుని రాజు చేయుటచే రామసుగ్రీవులకు స్నేహ మిట్లు కుదిరెను. నేను వారి మంత్రిని. నిన్ను వెదకుచు సముద్రము దాఁటి యిచటికి వచ్చితిని.

క. హనుమంతుఁడఁ బేరను నా, యినజుఁడు రాజ్యస్థుఁడై మహిత కోటిన్
నిను వెదకఁగఁ బదిదిక్కుల, కును బంచిన వారు చనిరి నీ కొఱకై. ౧౭౦

తా త్ప ర్య ము.

నా పేరు హనుమంతుఁడు. సుగ్రీవుఁడు రాజ్యము నంగీకరించిన వాఁడై తాను చేసిన ప్రమాణము ప్రకారము నానరకోట్లను నిన్ను వెదకుటకై పది దిక్కులకును బంపినను వారును నీకై వెడలి పోయినారు.

ఉ. వాలి తనూభవుండు కపివల్లభుఁ డుత్తమశూరుఁ డంగదుం
డోలిఁ ద్రిభాగసైన్యయుతుఁ డూనె స్వయంబుగ నీతదర్థమై
శైలవరంబు వింధ్యమునఁ జాలదినంబులు గోసి మేము దు
ర్గాళిని ద్రోవ తప్పి వ్యథనార్తిఁ బడం జనెఁ గాల మంతయున్. ౧౭౧

అర్థములు. త్రిభాగసైన్యయుతుఁడు = సైన్యములో మూఁడవ భాగ ముతోఁ గూడిన వాఁడై; సమాసంబున సంఖ్యార్థకము సంఖ్యేయార్థక మగును. తృతీయ భాగ మనుటకు త్రిభాగము. స్వయంబుగన్ = తానే. ఏతదర్థమై = నిన్ను వెదకు కార్యమునకుఁగా.

తా త్ప ర్య ము.

వాలి కుమారుఁడు యువరాజు శూరులం దుత్తముఁడు నగు నంగదుఁడు సేనలో మూఁడవభాగముఁ దీసికొని యువరాజై యింట నుండవలసినవాఁ డయ్యు నిన్ను వెదకవలయు నని తానే పనిపూనెను. మేము వింధ్యపర్వతమునందుఁ జాల దినంబులు వెదకి త్రోవ తప్పి దుఃఖించుచుండ, జాల దినములు గడచెను. ఆ కారణ మున నిచ్చటికి నేను వచ్చుట కాలసహ్యమయ్యెను. "వింధ్యాత్తు దక్షిణో దేశో దక్షిణాపథసంజ్ఞకః॥ యావద॥

క. గుట్టయు గుట్టయు వెదకక, చెట్టును జెట్టును మఱుంగు • చేసుం జేమున్
బట్టుగ వెదకిన జనకుని,పట్టీ! నీయునికి దెలియఁ • బడ దయ్యెఁ గదా. ౭౪౩

తాత్పర్యము.

చెట్టు, చెట్టు గుట్ట గుట్ట వదలిపెట్టక బాగుగా నున్న చోటు చోటు వెదకితిమి గాని, నీ యునికిపట్టు మాకుఁ దెలియలేదు.

క. గడు దేవా కడచనియెను, బడయిలేమాజాల యున్న • పోబడిఁ గడమున్
గడుసరి కపిపతి యను నెలు, విడువఁగ నెంచితిమి మేము • వెలఁదీ యసువుల్.

తాత్పర్యము.

సుగ్రీవుఁ డిచ్చిన నెలగడువు మించిపోయెను. సీతాదేవి యున్నజాడ దెలియరా దయ్యెను. కపిరాజు కఠినుఁడు. ఊరకపోయినఁ జంపునని భయపడి మేమే ప్రాణములు విడువ నెంచితిమి.

—• హనుమంతుఁడు సీతాదేవితోఁ దన రాము యునికి దెలిసిన విధంబుఁ జెప్పుట •—

ఉ. అంగదుఁ డంతశోకమున • హా! యనుచున్ నినుఁ గోలుపోవుటల్
భంగము గృధ్రరాజునకుఁ • బ్రాణవినాశము వాలి కబ్బుటల్
శృంగమునందు మా కిటులు • చేయుటల్ మృతి, చెప్పికొంచు నో
యంగన! యేడ్చె, నేడ్చిన జ • టాయువు సోదరుఁ డంతయు న్వినెన్. ౭౪౪

తాత్పర్యము.

అప్పు డంగదుఁడు శోకముచే నిను నపహరింపఁబడుటయు, జటాయువు మరణించుటయు, వాలి వధయు, దిక్కులేనివారివలెఁ గొండ శిఖరమున మేము చావవలసి వచ్చుటయుఁ జెప్పుకొనుచు హా యని యేడ్చెను. అమ్మా! యా ధ్వని విని జటాయువున కన్న మా ముచ్చట లన్నియు వినెను.

మ. విని సంపాతి యనంగ గృధ్రపతి వే • వేవచ్చి మా యంతికం
బునఁ గోపారుణనేత్రుఁడై పలికె న • మ్ముల్ జూచి యెవ్వండు నా
యనుజుం జంపె వచింపుఁడీ ప్లవగులా • రా! యన్నఁ దారేయుఁడున్
దనుజుం డాతని నీ నిమిత్తము జన • స్థానంబునం ద్రుంచుటల్. ౭౪౫

అర్థములు. అంతికంబునను = సమీపమునను, కోపారుణనేత్రుఁడై = కోపముచే నెఱ్ఱనయిన కన్నులు గలవాఁడై, తారేయుఁడు = తార కొడుకగు నంగదుఁడు.

తాత్పర్యము.

ఆ గ్రద్ధరాజు పేరు సంపాతి. అతఁడు త్వరత్వరగా మా సమీపమునకు వచ్చి కోపముచే నెఱ్ఱనగు కన్నులు గలవాఁడై నా తమ్మునిఁ జంపినవాఁ డెవ్వఁడు వానరులారా! చెప్పుఁడని యడుగఁగా నంగదుఁడు నీ నిమిత్తమై రావణుఁడు జటాయువును జంపెనని చెప్పెను.

ఉ. అంతయు నాడె; నాత నరు•ణాత్మజుఁ డార్తి వహించి నీదువృ
 త్తాంతముఁ బల్కె రావణుని • ధామమునందు వసించి యుండుటల్
 సంతస మార దాని విని • చయ్యనఁ గీశులు లేచి లెన్నగ
 ప్రాంతముఁ బాసి చేరిరి మ•హాంబుధి యుత్తరతీరధారుణిన్. ౧౪౬

అర్థములు. అడన్ = చెప్పఁగా, అరుణాత్మజుఁడు = అనూరుని కొడుకు, ధామమునందు = ఇంట.

తా త్ప ర్య ము.

సర్వము చెప్పఁగా విని యనూరుని కొడుకగు సంపాతి దుఃఖపడి నీవు రావణాసురుని యంతఃపురమునం దున్న వార్త చెప్పెను. వానరు లందఱు నా వృత్తాంతము విని సంతోషించి లేచి యా కొండ శిఖరము విడిచి సముద్రముయొక్క యుత్తరపు టొడ్డు చేరితిమి.

ఉ. చిత్తము నిన్నుఁ జూడఁ ద్వర • సేయుచు నుండియుఁ గంధిదర్శనం
 బుత్తలపాటు గూర్చెఁ బ్లవ•గోత్తమపాళికి, నంత నేను లో
 నా త్తివ ధైర్యసారమున • నామక లోక్కశతంబు దాటి నై
 ర్ఋత్తము వీడు సొచ్చి నిశి • నొయ్యన రావణు నిన్నుఁ జూచితిన్. ౧౪౭

అర్థములు. కంధి=సముద్రము, ఉత్తలపాటు=కలఁత, నిశన్ = రాత్రియందు

తా త్ప ర్య ము.

నిన్నుఁ జూడవలయు నని నాకెంత తొందర పాటుండినను సముద్ర దర్శనము వానరులకు మనోవ్యాకులత్వము గలిగించెను. అప్పుడు నేను ధైర్యము సాహసము గలవాఁడనై నూఱామడ సముద్రమును దాఁటి రావణు నగరము ప్రవేశించి రాత్రియందు రావణు, నిన్నుఁ జూచితిని.

చ. కలసి వచించినాఁడ, మదిఁ • గాతరభావము మాని ధీరతం
 బలుకుము, నన్ను నమ్ముము, నృ•పప్రవరోద్యమ మూని నీకుఁగాఁ
 జెలి! యసుదెంచినాఁడఁ, గపి•శేఖరుమంత్రిని, వాయుపుత్రుఁడన్
 జలజహితాన్వవాయనృప•సత్తము రామునికూర్మి సాధ్విరో ! ౧౪౮

అర్థములు. కాతరభావము = భయము, నృపప్రవరోద్యమము = రాజశ్రేష్ఠుఁడగు రామచంద్రుని ప్రయత్నము, జలజహితాన్వవాయ = సూర్యవంశమువాఁడగు; వాయుపుత్రుఁడన్ =వాయుదేవుని కుమారుఁడను, 'నమస్తే వాయో - త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి' యను శ్రుతివాక్య మిట ననుసంధించునది. జగత్ప్రసిద్ధ ప్రాణమైన ప్రత్యక్ష బ్రహ్మముయొక్క కుమారుఁడను. దీనిచేఁ దన యుత్తమ కుల ప్రసూతి చెప్పినవాఁ డయ్యెను. దీనివలన నుత్తమ కులమునఁ బుట్టినవానిని గాని, గురువుగా గ్రహింపరాదని దేర్పడుచున్నది. అనుపూర్విగ వంశపరంపర చెప్పలేని

గురువును గురువుగా గ్రహింపరాదు. అట్లు చెప్పలేనివారు నీచకులులుగాను, నీచ మతమువారు గాను నుందురు.

తాత్పర్యము.

సాధ్వీరత్నమా! నా స్తవము చెప్పినాఁడను. నీవు భయము వదలి ధైర్యముతో మాటలాడుము. నన్ను నమ్ముము. నా యందు మాయలేదు. రామచంద్రమూర్తి కార్యము నిర్వహింప నీ నిమిత్తమై వచ్చినాఁడను. వానరరాజ మంత్రిని. వాయు దేవుని కుమారుఁడను. సూర్యవంశపు రాజగు రామచంద్రమూర్తి దూతను.

క. విదా రాముని కఖిలాయుధ, వారభృదగ్రణికి సుఖము • వర్ణితగుణ ! సు
గ్రీవారాధన యుక్తుం డగు, వీరుఁడు సౌమిత్రి సుఖతె • వెలసెడి నమ్మా! ౮౬౯

అర్థములు. అఖిలాయుధవారభృదగ్రణికిన్ = ఆయుధములు ధరించు వారలలో మొదటివానికి; వర్ణితగుణ=కీర్తింపఁబడు గుణములు కలదానా ! సుగ్రీ వారాధనయుక్తుఁడు = అన్నసేవతోఁ గూడినవాఁడు, సుఖతెన్ = సౌఖ్యముచే.

తాత్పర్యము.

అమ్మా! ఆయుధములు ధరించువారిలో శ్రేష్ఠుఁడగు నీ భర్తకు రామచంద్రమూర్తికి సుఖము. కీర్తింపఁబడు గుణములు గలదానా ! లక్ష్మణుఁడు అన్నసేవ చేయుచు సుఖముగా నున్నాఁడు.

క. నీ విభు హిత మెంచుచు సుగ్రీవుని నుడి దక్షిణమున • క్షితిజా ! నిన్నున్
నే వెదకుచు వనహేయుండ, నై వచ్చితి నిన్నుఁ గంటి • నతిపుణ్యమునన్. ౮౭౦

అర్థములు. నుడిన్ = మాటప్రకారము.

తాత్పర్యము.

నీ భర్త మేలుకోరి సుగ్రీవుని మాటప్రకారము దక్షిణపు దిశగా నిన్ను వెదకుచు వచ్చితిమి. అందు నా పూర్వ పుణ్యాతిశయమున నేను నిన్నుఁ జూడఁగలిగితిని.

చ. నినుఁ గనలేని దుఃఖమున • నిర్వాణఁగూరిన కీశపాళికిన్
వినిచి నినుం గనుంగొనుట • నే తొలంగించెద దుఃఖ మెల్ల, నో
జనని ! సముద్రలంఘనము • సార్థక మయ్యెను బుణ్యసంపదన్
హనుమ యొకండె కాంచె జన•కాత్మజ నన్యశ మేను గాంచితిన్. ౮౭౧

తాత్పర్యము.

నిన్నుఁ జూడలేక పోయితిమి గదా యను దుఃఖమున మిగుల భయపడుచున్న వానరసమూహమునకు నేను నిన్నుఁ జూచిన వార్త తెలిపి వారి దుఃఖ మంతయుఁ బోఁగొట్టెదను. తల్లీ ! నేను సముద్రము దాఁటుట సఫల మయ్యెను. నా పుణ్యాతి శయముచే హనుమంతుఁ డొక్కఁడే సీతాదేవిని జూడఁగలిగె నను కీర్తిని సంపాదించి తిని.

—♦ హనుమంతుఁడు సీతాదేవికిఁ దన జన్మవృత్తాంతముఁ జెప్పుట. ♦—

క. వీరుఁడు రాముఁడు సహాసి,వారిన్ సహమిత్రునిన్ స♦బాంధవునిన్ ర
క్షోరాజుఁ జంపి పోరన్, వారక గ్రహియించు నిన్ను ♦ నమ్ముము దేవీ! ౮౨

ఇంతవఱకుఁ దాను రామచంద్రమూర్తి పంపున దూతనై వచ్చిన వార్తఁ దెలిపి యిఁకఁ దన జన్మచరిత్ర చెప్పుచున్నాఁడు. ఏలన:—

"యస్య నజ్ఞాయతే శీలం, కులం తస్య చ సంశ్రయమ్
న సంగతిం కుర్యా, దిత్యువాచ బృహస్పతిః"

ఎవనియాచారము, స్వభావము, కులము నెవరి యొద్ద నాశ్రయించుకొనియుండునది తెలియదో వానితోడఁ గూడియుండరాదు, అని బృహస్పతి చెప్పెను. కావున స్నేహముచేసినను గలసి మెలసి యుండవలసి వచ్చినను గులహీనునితో నాచారహీనునితో సదాశ్రయము లేనివానితో నట్లు చేయరాదు గనుకఁ దన విషయము చెప్పుచున్నాఁడు. తన కులము, గుణము,ఊరు, నిజమైన పేరు, దాఁచువానిని నమ్మి దగ్గఱఁ జేరరా దన, నిఁక వానిని గురువుగా గ్రహింపవచ్చునా. కావున శిష్యులును గురువు వంశాదులను, వారి పుట్టుపు పూర్వోత్తరములను విచారింపవలెను.

తాత్పర్యము.

వీరుఁ డను రామచంద్రమూర్తి పరివారముతోను, మిత్రులతోను జట్టములతోను గూడిన రావణుని యుద్ధమునందుఁ జంపి నిన్ను గ్రహింపఁగలఁడు. నా మాట, దేవీ! నమ్ముము.

సీ. మాల్యవంతం బను♦మహితభూధరమున, జనని! నాతండ్రి కే♦సరి వసించుఁ
జనిదాను గోకర్ణాఖ్య♦శైలంబున కతండు, నల శంబసాదనుఁ ♦ డనెడి దైత్యు
దేవర్షి సంఘుని♦దేశంబు వధియించె, నతనిక్షేత్రంబున ♦ ననిలునకును
జనియించినాఁడను♦స్వకృతకర్మంబునఁ, హనుమంతుఁ డను నామ ♦ మమరె నాకు,
ఆ. నీవు నమ్ముకొఱకు♦నీ నాథుగుణముల, నెల్లఁ బలికినాఁడ ♦ నివలనుండి
నిన్నుఁ దోడుకొనుచు ♦ నీవల్లభుం డేగు, భయపడంగ వలదు ♦ భవ్యశీల! ౮౩

తాత్పర్యము.

మాల్యవంత మను గొప్ప పర్వతము గలదు. అందు నా తండ్రి కేసరియను వానరరాజుండును. ఆయన యొకసారి దేవఋషుల సంఘముచే నాజ్ఞాపింపఁబడిన వాఁడై శంబసాదనుఁడను దైత్యుని జంప గోకర్ణమను పర్వతమునకుఁ బోయి వానిని జంపెను. ఈ విధముగ మా తండ్రి లేఁదమునుండి రాక్షసులకు మాకు విరోధమే. ఆయన భార్యయందు వాయుదేవునకు నేనుజన్మించితిని. నేను స్వయముగఁ జేసిన కార్యముచే నాకు హనుమంతుఁ డను పేరువచ్చెను. నీవు నమ్ముకొఱకు నీ భర్త గుణములను నన్నిటిని చెప్పితిని. నిన్నిచ్చటనుండి నీ ప్రియుఁడు తోడుకొని పోవును. నా మాట నమ్ముము.

ఇది యాచార్యకృత్యము. శిష్యునకు భగవద్విషయము నంతయు సమగ్రముగఁ జెప్పి నీవు భయపడ వలదు. నిన్ను భగవంతుఁడు తన యొద్దకు స్వయముగా వచ్చి తీసికొని పోవును. భయపడ వలదు. కాలమునకు వేచి యుండుము. నీవు మాత్రము సదాచారము,భక్తి విశ్వాసములు మానవలదని చెప్పును. భవ్యశీల యను సంబోధన మీ యర్థ మిచ్చుచున్నది. గురుపరంపరయుఁ జెప్పినవాఁడయ్యెను.

చ. అనవుడు విశ్వసించె జన•కాత్మజ యాతని దూతగా మనం
బునఁ, గడు సమ్మదాశ్రువులు • ముమ్మరమై ప్రవహించె వాలుఁగ
న్గొనలను, రాహుముక్తశశి•కైవడి నెమ్మోము వికాస మందె, వా
నిని వలపోసి నిక్కపు వ•నేచరుఁ డంచు నవాప్తశంక యై. ౧౫౪

తాత్పర్యము.

ఇన్ని విధములఁ జెప్పఁగా సీతాదేవి హనుమంతుని రామచంద్రమూర్తి దూత యని నమ్మెను. నిడుపాటి కన్నుల కొలకుల నుండి సంతోషబాష్పములు విశేషముగఁ బ్రవహించెను. ముఖము రాహువుపట్టి విడిచిన చంద్రునివలె వికాసము నొందెను. సందేహమువదలి వీఁడు నిజముగా రామదూత వానరుఁడని నమ్మెను.

ఈ విధముగ శిష్యులు గాఁగోరువారు గురువుల మని వచ్చువారిని బరీక్షింపక గ్రహింపరాదు.

క. దానిని గని హనుమంతుఁడు, మానవతీమణికి ననియె • మఱలి చనియెదన్
జానకి! యూఱడుమీ నీ, కే నేమి యొనర్తు నెద్ది • యిష్టము చెపుమా. ౧౫౫

తాత్పర్యము.

ఈ ప్రకారము సీతాదేవి తన్నుఁ దన మాటలను నమ్ముటయు, సంతోషించుటయుఁ జూచి యమ్మా! మఱలి నేను రామచంద్రుని యొద్దకు నీ వార్తఁ దెలుపఁబో వలసి యున్నది. నీకేమి సాహాయ్యము చేయుమనెదవు, చెప్పుము. ఊఱడిల్లుము తల్లీ! ఊరడిల్లుము. నీ యిష్టము చెప్పుము. చేయుదు ననుటచే శిష్యుని సందేహము లన్నియు గురువు దీర్ప శక్తిగలవాఁడై యుండవలె నని నేర్పుచున్నది.

క. పవనతనూజుఁడ నగుటను, జవబలగరిమములఁ దండ్రి • సరిపోలుదు నో
యవనిజ! కపిమాత్రుఁడ నని, తలఁపుట సందియము నీకుఁ • దగదు సుశీలా!

తాత్పర్యము.

నేను వాయుపుత్రుఁడ నగుటచే వేగాతిశయము చేతను, బలాతిశయము చేతను తండ్రికి సమానుఁడను. వీఁడు సామాన్య వానరుఁడు, ఏమి చేయఁగలఁ డని సందేహించుట సత్స్వభావము గల నీకుఁ దగదు.

పవన తనూజుఁడను = పునాతి - పవనః; పవిత్రము చేయువాఁడు. అట్టి వాని కొడుకను. ఆయన గుణములు నాయందుఁ గలవు. కావున నేను అపవిత్రము లగు కార్యము గాని, మాటలు గాని నేను చెప్పనని భావము. నీవును సుశీలవు కావున

నీ కింకరుమారము చెప్పఁబూనితిని గాని నీ నదపడి పరిగాదేని నీతో నేను మాట లాడి యుండ నని సుశీలాశబ్దము స్ఫురింపఁ జేసెడిని.

—• ౩౬-వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవికి శ్రీరామముద్రిక నిచ్చుట •—

(ఉ.) ఇంకను నమ్మ నేని జన•కేశ్వరనందిని! చూడు రామనా
మాంకిత మైన యుంగరము•నాదటఁ బంచె నతండు దీని నీ
కింకరుచేత నీకు మది•కిన్ ఘటియింపఁగ నమ్మకంబు నీ
యంకిలి దీఱు నం చనఁగ • నా యమ గైకొని దానిఁ బ్రీతితోన్. ౬౫౭

అర్థములు. రామనామాంకితము = శ్రీరామ యను నక్షరములు చెక్కఁ బడినది. అంకిలి = కలఁత, వ్యాకులత్వము, ఆయమ = అంతవఱకు వీఁడు రావణుఁ డని సందేహించి హనుమంతుని ప్రక్క చూడకుండిన యా సీత బ్రీతితోఁ గైకొని = ఇదియేమి మాయనో, యే కమసాలిచేతఁ జేయించుకొని వచ్చెనో యని భీతిచే నిరాకరింపక ప్రీతిచేఁ జేతఁ దీసికొనెను.

కై+కొను = చిరకాలమున విడిచిపోయిన బంధువు అపుడు తటాలున రాఁగానే సంతోషముచే నతని చేతులు పట్టుకొని యాదరించినట్లు చేకొని.

తాత్పర్యము.

జనకరాజు కూతురా! నామాటయందు, నా యందును నీకింకను సందేహము గలదేని శ్రీరామచంద్రమూర్తి పేరు చెక్కఁబడిన యీ యుంగరమును జూడుము. దీనిని నీ కింకరుఁ డగు నాచేత నీ కిమ్మని నీవు దీనిని జూచిన నీకు నాయందు నమ్మ కము గలుగు నని ప్రేమతో నిచ్చి నీయొద్దకుఁ బంపెను. దీనిచే నీమనోవ్యాకులత్వముఁ దీఱు నని యీ యుంగరమును నామె కిచ్చెను. ఆమెయు దానిని సంతోషముతోఁ గైకొనెను.

దీని వలన సంశయచిత్తులకు, శ్రద్ధచాలని వారికి రామమంత్ర ముపదేశింపరా దని యేర్పడుచున్నది. సీతాదేవి సందేహము దీఱె ననియు, శ్రద్ధగలదయ్యె ననియు ౬౫౭ వ పద్యంబునఁ జెప్పఁబడెను. ఆ యమ గైకొని దానిఁ బ్రీతితో ననుటచేఁ దారకమంత్రము దొరకెను, ధన్యుఁడనైతి నని సంతోషమున గురూపదిష్ట మంత్ర మును శిష్యుఁడు గ్రహింపవలె నని యేర్పడు చున్నది. నా కిది చెప్పు, ఇంది చెప్పు మని యడుగరాదు. గురు వనుగ్రహించినది గైకొనవలెను.

ఈ విధముగ సీతాంజనేయుల చర్యవలన శిష్య లక్షణము, గురు లక్షణము ముముక్షు హితచర్య, భగవన్మంత్రప్రాప్తి చెప్పఁబడెను.

(శా.) పతికరభూషణంబుఁ గని • పద్మదళాక్షి మునంబు నొందెఁ దాఁ
బతియె సమక్ష మచ్చటికి • వచ్చినయట్లుగఁ, దాఁ బ్రమోద్రేక యై

పద్మదళాక్షీ = పద్మము ముకుళించి యుండిన రేకులు తెలియరావు. కావున విచ్చిన పద్మ మనియే చెప్పవలెను. దాని వలన సీతాదేవియు సూర్యుని జూచిన కమలమువలెఁ దన ముఖమును వికాసింపఁజేసెనని భావము. ఉంగరమును జూచినంత మాత్రముననే ముదంబు చెందిన సీత యిఁక రామాగమనము రావణవధ పునస్సంగమము గలిగిన నెంత యామోద ప్రమోద సమ్మోదములు గాంచునో కదా యని సూచన.

తామ్ర శుక్ల నయనంబులు=రక్తవర్ణము. నీ విన్నిదినాలు నన్ను పేక్షించి తివిగదా యని కోపమును - స్వయంకృతాపరాధమునకు నాయన ననకేల యని శుక్లవర్ణము శాంతిని గన్నులు సూచించెను.

క. హ్రీమతి బాలామణి పతి, సేమము సందేశవార్తఁ • జెప్పఁగఁ గపియున్
సామోదంబుగ విని యా, సామీరిని గౌరవించి • స్తవ మొనరించెన్. ౧౫౫

అర్థములు. హ్రీమతి = లజ్జగలది. తనయందు భావోదయము, భావోల్బణము, భావశాంతి తాను జవాలున లేచి భర్తను గౌగలించుకొనఁ బోవుట యీ చేష్టలను హనుమంతుఁ డే మనుకొనునో యని సిగ్గుపడెను.

మీఁదఁ జెప్పిన విషయము కవిహృదయము. కాదేని యిచ్చట 'హ్రీమతి' వ్యర్థ విశేషణము, అప్రస్తుత మగును. సిగ్గు పడవలసిన వేఱు కారణము లేదు. ఈ యర్థమును బాలామణి యను శబ్దము బలపఱచుచున్నది. సీత యిప్పటికి ముప్పది రెండేండ్లది కావున బాలనాయిక కాదు. అట్లుండియు బాలామణి యనుటచే నా సమయంబున ముగ్ధనాయికయందలి గుణము లజ్జ యామెయందుఁ గానవచ్చె నని భావము.

'ఉదయ ద్యౌవనా ముగ్ధా లజ్జావిజిత మన్మథా' యని కదా ముగ్ధ లక్షణము. సామోదంబుగన్ = ఆమోదముతోఁ గూడినట్లుగ, తొలుతటి మోద మిప్పు డామోద మాయెను. సామీరి = సమీర కుమారుఁడు = అంజనేయుఁడు. సమీరుఁ డనఁగా 'సమ్యక్ ఈరతి - సమీరః' యని వ్యుత్పత్తి ప్రకారము చక్కఁగాఁ జెప్పువాఁ డని యర్థము.

"వ్యాహరత్యభిన త్తేభిరధా ఈరయతీ త్యపి" యని క్షీరస్వామినిఘంటువు. కారణ గుణము కార్యమం దుండును, గావున ప్రియ వక్తృత్వ మాంజనేయునందుఁ గలదని భావము. స్తవము = స్తోత్రము. స్తవ మొనరించె ననుట గురుస్తోత్రము గురుమాహాత్మ్య వర్ణనము దెలుపుచున్నది. భగవన్మూర్తి సాక్షాత్కరింపఁ జేసిన గురువు నెంత స్తోత్రము చేసినను గొఱతయే.

తాత్పర్యము.

లజ్జావతి యగు నా బాలిక పతిక్షేమము, పతివార్త కపీశ్వరుఁడు చెప్పఁగా

ఆమె యెక్కడ నేడ్చుచున్నది. నే నిక్కడ నేడ్చుచున్నదానను. కుశలిగా నా భాగ్యవశేత = నా భాగ్యవశమున బాగున్నాఁడుకదా! ఆయన యెందైన నుండనీ బాగున్నాఁడుకదా! నాకంతే చాలు. నే నెట్లు పోయిన నాయనకేమి? కౌసల్యానిరామయంకు కుశలితయా = నేను నిర్భాగ్యురాలనే. ఆమె కడుపు చలువచేసనైన క్షేమముగా నున్నాఁడుకదా. అదియే నాపాలికి భాగ్యము. తండ్రీ! తండ్రితోఁ జెప్పుకొన్నట్లు సిగ్గు విడియును విడిచి తండ్రివలె నన్నాదరించి నా కష్టములు తొలగించెదవని చెప్పుకొనుచున్నాను. గాని పరాయివాఁడవు నూతవని నేను జెప్పఁ బూనలేను. మగఁడు వదలిన ఆఁడుబిడ్డలు తమ దుఃఖమును దండ్రితోఁ జెప్పుకొనక మఱి యెవరితోఁ జెప్పుకొందురు?

అనుపమగుణః = అసమానమైన గుణములుగలవాఁడు. రామునివలె నొకటి చెప్పి మఱియొకటి చేయువాఁడు గాఁడు. ఎంత చెప్పునో యంతే చేయువాఁడు. సుమిత్రానందవర్ధనుఁడు = రామచంద్రమూర్తి యడవికివచ్చి తల్లిని దుఃఖపెట్టెను. లక్ష్మణుఁ డన్నవెంట వచ్చి తల్లిని సంతోషపెట్టెను. అటువంటి లక్ష్మణుఁడు రామదాస్యమే చిహ్నముగాఁ గలవాఁడు, రామునకుఁ గష్టము దోఁపనీయక సేవ సేయుటే సుఖముగా నెంచుచున్నాఁడు గదా. హితేంద్రా = నా హితము కోరు బంధువు లున్నారు. ఏమి లాభము? అక్కఱవేళకు నీ వాదుకొన్నట్లు వార లాదుకొనఁ గలిగిరా? కావున నా మేలు కోరు బంధువు లందఱిలో నీవే శ్రేష్ఠుఁడవు. అక్కఱకు రాని చుట్టము లుండియు నేమి ప్రయోజనము?

రాముండు కుశలియేన్ = రామచంద్రమూర్తి కుశలిగా నున్న పక్షమున, భూమి వార్ధులన్ = భూమిని సముద్రమును, కల్పాగ్నిలీలన్ = ప్రళయకాలాగ్నివలె, కినిసి = కోపించి, అయ్యో! రాముఁడు ప్రాణముతో నుండినయెడల నా నిమిత్తమై కోపించి ప్రళయకాలాగ్నివలె భూమిని సముద్రమును గాల్పకున్నాఁడా? నన్ను రక్షించుకొనుటకై యంతపని చేసి యుండునే. చేయలేఁడా? అది రామునకుఁ గష్టకార్యము గాదే. ఆయన కన్నెఱ్ఱజేసినఁ జాలును. అదియే ప్రళయకాలాగ్ని చేయు పని చేయును గదా. విల్లు చేతికిఁ దీసికొని యెక్కుపెట్టి బాణము సంధించి సముద్రముపై నొకటి, భూమిపై నొకటి ప్రయోగింపవలెనా? అంజనేయా! రాముఁడు కుశలి యని నీవు చెప్పుటచే నమ్ముచున్నాను గాని యంతకార్యము చేయలేదు గావున మఱియొకరు చెప్పిన నమ్మకుండెదను. నీవు చెప్పుటచే నమ్మెదను గాని యంతకార్యము చేయకుండుటచే నా మీఁదఁ బ్రేమ తప్పిన దని తలఁచెదను. లేదా యంతటిశక్తి లేదని తలఁచెదను. వారి శక్తి యెఱుఁగుదానిని గనుక, ఆఁడుదాని యుక్కులు చెవులు సోఁకనే కాని యిటువంటి వారిని దండించుటయును లేదు.

కాకేమి సురలు = సురలు కాకేమి? సురలే యగుదురు. నాకులన్ = నాకులనైనను = దేవతలనైనను. నాకము + ఇ = నాకి = స్వర్గమందుండువాఁడు,

గెల్వరా = గెల్వలేరా. నా పాపఫలము వారికి నాయందు దయ తప్పఁజేసి వారి శౌర్య ముపయోగింపకుండఁ జేసినది. అకారణముచే; మద్వియోగ వ్యథార్తిని = నన్ను విడుచుట వలనఁ గలిగిన దుఃఖముచే, మఱుఁగకుండక = సంతాపింపక, నీళ్ళు కళపెళ కళపెళ క్రిందికి మీఁదికి మసల గ్రాఁగుట మఱుఁగుట యుండుట.

## తాత్పర్యము.

తండ్రీ! సత్యప్రతిజ్ఞగల కౌసల్యాకుమారుఁడు నా భాగ్యవశమునఁ గుశలముగా నున్నాఁడుగదా. అసమానగుణవంతుఁ డగు సుమిత్రానందనుఁడు లక్ష్మణుఁడు హరీంద్రా! సుఖమా? రాముఁడు కుశలముతో నుండినఁ బ్రళయకాలాగ్ని వలెఁ గోపించి నా నిమిత్తమై భూమిని, సముద్రమును గాల్పలేఁడు గదా. వారు శూరులు కారా, శూరులే. దేవతలనైనను యుద్ధమందు గెల్వఁగలవారే. నా పాపఫలమువలన వారు ప్రయత్నము చేసినవారుగారు. అన్నా! యాంజనేయా! నన్ను నెడఁబాసిన తాపముచే రామచంద్రమూర్తి సంతాపింపకున్నాఁడుగదా. నా కొఱకై యూరక దుఃఖింపఁడు గదా. నా విషయమునఁ గాకున్నఁ దన విషయమునైనను నిఁకమీఁద నయోధ్యయందుఁ జేయవలసిన కార్యములు మఱల వెండ్రియూడుట మొదలైనవి యాలోచించుచున్నాఁడా? లేక నా విషయమై నా ప్రియురాలి కింత కష్టము వచ్చెనే, యెట్లు తప్పింతమని చేయవలసిన కార్య మెన్నఁడైన నాలోచించుచున్నాఁడా?

సీ. ఏమఱఁడే కదా • యెల్లకార్యంబులు, దీనుఁ డై సంభ్రాంతి • వానరేంద్ర?
పురుషకారము లెల్ల • సరిగఁ జేయును గదా, యా రాజనందనుం • డాంజనేయ?
సలుపునా మిత్రుల • శత్రులయెడ రెండు,మూఁ డుపాయంబులు • మోసపోక?
గడన సేయునుగదా • కడుఁ ద్రివర్గంబుఁ! జెలికాండ్రు రతనిఁ బూ•జింతు రయ్య?
తే. దేవతానుగ్రహమును జిం•తించుకొనునొ? పౌరుషంబును దైవంబుఁ • బరఁగుచున్నె?
కరము దన్యైన నామీఁదఁ • గరుణ గలఁడె? క్రోధమునా నన్ను నిటు • క్రోధితండ్రి?

అర్థములు. పురుషకారము = మనుష్యులు చేయవలసిన ప్రయత్నము. మిత్రులయొక్క సామదానములను రెం డుపాయంబులు. శత్రులయొక్క దానభేద దండములను మూఁ డుపాయంబులు, గడనసేయునుగదా = సంపాదించునుగదా.

## తాత్పర్యము.

నన్నెడఁబాసిన కారణముచే శోకతప్తుఁడై తొట్రుపాటుచేఁ జేయవలసిన కార్యములన్నియు నేమఱక చేయుచున్నాఁడుగదా (ఇవన్నియు నప్పగిస్తేను అని నొక్కుఁగవలయును.) నామీఁద ప్రేమ మునుపటి వలెనే యుండెనా? (ఈ కార్యము చేసియుఁ జేయఁజాలఁడని యర్థము.) ఆంజనేయా! ఈ రాజకుమారుఁడు రాజధర్మ మనుసరించి చేయవలసిన పురుష ప్రయత్నములు లోపములేక చేయుచున్నాఁడు కదా. మిత్రులందు సామదానములు, శత్రువులందు దానభేదదండము లుపయో

గించుచున్నాఁడుగదా. మిత్రులను సంపాదించుచున్నాఁడా? స్నేహితు లతని నాదరించురా? దైవ సాహాయ్యము కలుగు నుపాయ మాలోచించుచున్నాఁడు గదా! పౌరుషమును నమ్మి దైవమును నమ్మి పురుష ప్రయత్నము విడువక రెంటిని సాధించి యున్నాఁడుగదా. ఇన్ని కార్యముల సందడిలో మిగుల దూరమం దుండు నన్నెప్పుడైనఁ దలఁచునంతటి దయగలదా? ఈ బాధనుండి తొలఁగించి నన్ను రక్షించు నని యాశగలదా?

శ్లో. అగర్భశ్రీమంతుఁడు, భోగి వ్యథానర్హుఁ డైన• పుణ్యుఁడు రాముం
డీ గతి నాకై దుఃఖా,భోగంబున మిగుల నవసి•పోలేదు గదా? ౨౬.౩

అర్థములు. అగర్భశ్రీమంతుఁడు = తల్లికడుపులో నుండినది మొదలు సంపద ననుభవించినవాఁడు, శ్రీ యాయనను విడువనిదాయెను గదా. (౨) శ్రీశబ్దమునకు విషమనియు నర్థము గలదు. తల్లి గర్భమునందుండి హృదయమున విషము గలవాఁడే. భోగి = (౧) భోగము ననుభవించువాఁడు, (౨) సర్పము, వ్యథానర్హుఁడు = దుఃఖపడఁదగిన వాఁడు కాఁడు. (౨) పరులబాధ యెట్టిదో తెలిసికొను యోగ్యత లేనివాఁడు, పుణ్యుఁడు = పుణ్యమూర్తి. (౨) వక్రోక్తి-పుణ్యము నొందనివాఁడు. రాముఁడు - (౧) రామచంద్రమూర్తి. (౨) పైకి నభిరాముఁడుగాఁ గనఁబడువాఁడు. దుఃఖాభోగంబునన్ = దుఃఖాతిశయముచే, నవసి = శుష్కించి.

తాత్పర్యము.

ఆంజనేయా! తల్లిగర్భమున నుండునది మొదలు సంపద ననుభవించువాఁడు. పుట్టిన పిమ్మట భోగములే నిత్యముగా ననుభవించువాఁడు, దుఃఖ మెట్టిదో యెఱుఁగ నర్హుఁడు కానివాఁడు. ఇట్టి రాముఁడు అడవులలోఁ దిరుగుటచే నంత శుష్కింపవలయునో యనాతీగాని, నా నిమిత్తమై దుఃఖాతిశయముచే విశేషించి శుష్కింపక బాగున్నాఁడుకదా.

తల్లిగర్భమునం దుండినది మొదలు విషముగల పాము వలె కాటువలనఁ బరులు పడు బాధ యెట్లు తెలిసికొనఁగలడు? యుక్తి లేని యుక్తిచే నేను బాధపడుచుండ నాకై యీ పుణ్యుఁడు (వ్యతిరేకలక్షణ) దుఃఖించుచు మిగుల శుష్కింపక పూర్వమువలె బాగున్నాఁడుకదా!

సీ. కౌసల్యయు సుమిత్ర • కపివరా! భరతుండు, కుశలులే? యవ్వార్త • వినఁదగునె?
భ్రాతృవత్సలుఁ డైన• భరతుండు నాకయి, యక్షౌహిణీసేన • నంపునయ్యా?
దంతినఖాయుధ•తనుదరకోటితో, సుగ్రీవుఁ డీ లంకఁ • జొచ్చునయ్యా?
పత్నీసంపన్నుండు•సౌమిత్రి యసువుల, నాగాత్రవృష్టిని • నణఁచునయ్యా?
తే. చూతునా నేను భీకర• శాతబాణ,జాలి తాంగ సబాంధవు•దశశిరస్కు?
నా నిమిత్తంబు వగచుచు•న్నాఁడె? యేమొ, మతి మనోపతి యుణఁచునా•యయాలి తార్తి?

అర్థములు. అవ్వార్త వినఁదగునె = వారి కుశలవార్త యేమైన వినవచ్చు

ఉ. ఏ మనుదాన దూతుఁడ! మహీశ్వరు, నా పయి హార్దికంబు శ్రీ
రాముని కాత్మమాతపయి • రాజగు తండ్రిపయిన్ హితాళిపైఁ
బ్రేమము హెచ్చు గాదు సతి•ప్రీతియుఁ గా, దటు గావునం గదా
యా మహితాత్మువార్త విను•నంతకు నిల్చితి మేనఁ బ్రాణముల్. ౪౬.౭

తాత్పర్యము.

అయ్యా! రామదూతా! మా రాముఁడు కోపచిత్తుఁడు, నిన్ను విడిచి సహించితివా యని నిష్ఠురము లాడెదవే, నీవు మాత్రము తక్కువైన వానవా? ఇంత దాన వయ్యుఁ, జిన్నదానవయ్యు, నింత యాపదలో మునిఁగియుఁ బ్రాణములు నిలిపితివే నీ ధైర్యము ముందట మా రాముని ధైర్యమే మాత్రములే యునువా. నేను ప్రాణములు నిలిపిన కారణము చెప్పెద వినుము. నే నేమని చెప్పుదును. నా హృదయేశ్వరుఁడైన శ్రీరామచంద్రమూర్తికి నా యం దున్న ప్రేమ కంటె నెక్కువ ప్రేమగాని, సమానమైన ప్రేమగాని తన తల్లి యందు లేదు. తండ్రి యం దుండినది కాదు, తన యాప్తులయందును లేదు. ఇది నే నెఱుఁగుదును. ఆ ధైర్యము చేతఁగదా యాయనవార్త వినవచ్చువఱకు బొందిలోఁ బ్రాణములు నిలిపి యున్నదానను. నేను ప్రాణము విడిచితినా నా యందంతటి ప్రేమగలవాఁడు కావున నెటులైన నిచ్చటికి రానేవచ్చును. వచ్చి నేను జచ్చితి నన్న వార్త విని యాయన "అయ్యో! నా ప్రేమ వ్యర్థము చేసెఁగదా. నేను వచ్చి తన్ను రక్షింపఁ గల నను ధైర్యము, విశ్వాసము నా యందు లేనిదయ్యెఁగదా, ఎంతదయాహీనురా లని తపించునే, నా యందంతటి ప్రేమగలవానికి నేను దుఃఖము కలిగింప వచ్చునా? ఎన్ని బాధలైన సహింతునుగాక యని కదా ప్రాణములు నిలిపితిని. ప్రాణము తీయని రక్షించుచున్నానని తలఁచితివా? ఇంత వఱకుఁ జైపద్యములందు వానరేంద్రా! కపీంద్రా! యని సంబోధించుచుండిన సీత యిప్పుడు దూతా! యని సంబోధించెను. ఏల? దూతతోఁ జెప్పినమాట లతని స్వామితోఁ జెప్పినట్లే. అతని స్వామి కా మాట లతఁడు చెప్పవలయు ననియే యుద్దేశ్యము. శ్రీభాగవతమున దశమ స్కంధమున గోపికల భ్రమరగీతలు పోల్చి చూచినది.

సీతాదేవి తనయందు రామచంద్రమూర్తికిఁ గల ప్రేమ, యాయన తల్లిదండ్రులయందుఁగాని యాప్తులగు బంధువులందుఁగాని లేదని చెప్పుటచే భర్త లగు వారు పతివ్రత లగు తమ భార్యలం దట్టి ప్రేమ యుంచవలె నని సూచన:—ఏల? అర్ధాంగ లక్ష్మియై సగము దేహము పంచుకొని సహధర్మచారిణియై సమాన సుఖదుఃఖయై యీ లోకమునందే కాక పరలోకమునందును, నీ జన్మమందే కాక కడచి నట్టియు, రాఁగలట్టియు జన్మంబులందును వెంటనంటియుండు సాధ్వి యగు భార్యకుఁ దక్కినవా రెట్లు సాటి కాఁగలరు! వారితోఁ గి కూటమికి ఋణసంబంధము కారణము. ఒక యాత్మయే కదా రెం డయ్యెను.

లయినను దైత్యులయినను, నష్టము వచ్చినా వారికే బట్టిన తలదిమ్ము వదల్పును. తల్లీ ! నిర్దుష్ట పాతివ్రత్యమే యలంకారముగాఁ గలదానా ! నా మాట నమ్ముము.

ఇట్లు చెప్పుటచే సంతసని చేయుండుమని యర్థము. నా పాతివ్రత్యము వ్యర్థముగాఁ బోదు యని సీతవాక్యమున కిది ప్రత్యుత్తరము.

క. సింగముచేఁ జిక్కిన మాతంగమువలెఁ ద్వద్వియోగ•తాపార్దితుఁడై
యంగన! సుఖము నెఱుంగఁడు, పొంగఱి కృశియించుఁ బూట•పూటకు దేవీ !

అర్థములు. మాతంగమువలెన్ = ఏనుఁగువలె, త్వత్ + వియోగతాప+ అర్దితుఁడై = నిన్ను నెడఁబాయుట, వలనఁ గలిగిన తాపముచేఁ బీడింపఁ బడిన వాఁడై, పొంగు + అఱి = సంతోషము చెడి; ఈ పద్యములో మన్మథావస్థలలోఁ గృశత్వ మను నవస్థ చెప్పఁ బడెను.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి చిక్కిపోలేదుగదా యంటివి. ఆయనస్థితి చెప్పెద వినుము. సింహము బారిఁబడిన యేనుఁగువలె నిన్ను నెడఁబాయుటవలనఁ గలిగిన తాపముచే బాధపడుచు సంతోషముచెడి పూటపూటకుఁ జిక్కిపోవుచున్నాఁడు.

చ. మలయసుమేరువింధ్యశిఖ•మందరదర్దురభూధరాళిపై
ఫలముల వేరువెల్లకుల•పై జననీ ! శపథంబుఁ జేసెదన్
గలవు కనంగ భవ్యతర•కంజవిలోచన ముజ్జ్వలోరుకుం
డల మరుణాధరంబు నగు • నాథమనోజ్ఞముఖేందుబింబమున్. ౪౭౨

అర్థములు. భవ్యతరకంజ విలోచనము = శుభకరమైన కమలములవంటి కన్నులు గలదియు, ఉజ్జ్వలోరుకుండలము = ప్రకాశించు గొప్ప కుండలములు గల దియు (ఉంగరమువలె దీనిని విసర్జింప లేదు. ఉత్తచెవులతో నుండరాదు గావున) అరుణాధరంబు = ఎఱ్ఱని పెదవిగలదియు, అగు, నాథ = రామచంద్రమూర్తి యొక్క, మనోజ్ఞ=అందమైన, ముఖేందుబింబమున్ =చంద్రునివంటి ముఖమును.

తాత్పర్యము.

తల్లీ ! నేను రిత్తయొట్టుమాటలు చెప్పరాలేదు. మలయము, మేరువు, వింధ్యపర్వతము, మందరము, దర్దురము, లోనగు కొండల మీఁదను మహాకారమైన పండ్లు, వేళ్లు, గడ్డల మీఁదను ప్రమాణము చేసి చెప్పుచున్నాను. నీవు మేలయిన కమలములవంటి కన్నులు, గొప్ప కుండలములు, ఎఱ్ఱని పెదవిగల నీ మగని రామ చంద్రుని యందమైన ముఖమును చంద్రునివలెఁ జూడఁగలవు.

క. రాముని ప్రస్రవణతటీ•ధాముని జూడంగఁ గలవు • త్వరగా వల సు
త్రాముని విబుధాలయగత•భామావిభునాకపృష్ఠ•భాసురుఁ బోలెన్. ౪౭౩

అర్థములు. ప్రస్రవణ తటీధామునిన్ = ప్రస్రవణ పర్వతము దగ్గఱ యుండు వానిని, సుత్రామునిన్ = ఇంద్రుని, విబుధాలయ గతె = స్వర్గమందుండిన, భామా

సిత=కాంతిచేఁ బూజింపఁబడు, నాకపృష్ఠ భాసితుఁ బోలెన్=నాకపృష్ఠ మను పర్వత ప్రదేశమునఁ బ్రకాశించు వానివలె.

తాత్పర్యము.

నేను చెప్పినది యసత్యమని నమ్మవేని రమ్ము. నీవే స్వర్గమందలి నాకపృష్ఠము నందుండు నింద్రునివలెఁ బ్రస్రవణ పర్వతశిఖరంబున నున్న రామచంద్రమూర్తిని జూడఁగలవు.

1. మాంసము ముట్టఁడు రాముఁడు, హంసీవరయాన! మధువు ♦ నాసింపఁడు సా
యంసమయములన్ మాత్ర మహింసారతి వన్యఫలము ♦ లించుక గొనెడిన్.

అర్థములు. మధువు = తేనె, వన్యఫలములు = అడవి యందుఁ బుట్టిన పండ్లను, ఇంచుక = కొంచెము.

శ్లో॥ దృఙ్మనస్సంగ సంకల్పా జాగరః కృశతాఽరతిః
హ్రీత్యాగోన్మాద మూర్ఛాంతా ఇత్యనంగదశా దశ.

యని మన్మథావస్థలు పది. అందు అరతి యను నవస్థ యిందుఁ జెప్పఁబడెను. అరతి యనఁగా దేనియందుఁ బ్రీతి లేక పోవుట.

తాత్పర్యము.

మాంసమును దాకఁడు, తేనె నాశింపనే యాశింపఁడు. సాయంకాలమందు వానప్రస్థమార్గమున హింసలేక యడవి ఫలములను దేహధారణార్థమై కొంచెముగఁ దీసికొనును. దినమున కొక పూఁటనేకాని రెండవసారి భుజించుట లేదు. నాకు రెండు పూఁటల నాహారము లేదుగదా యందువేమో. నీవు చేయవలసిన కష్టము లేదుగదా! ఆయనకు యుద్ధకార్యముగలదే; నిరశనవ్రతముఁ బూనిన యుద్ధ మెట్లు చేయఁగలఁడు. అదియును గాక, నీవు ప్రోషితపతికవు, ఉత్తమభార్యవు. కావున పరదత్తము, అందు శత్రుదత్తము గ్రహింపరాదు. అందు రావణుఁడు పతితుఁడు. కులటాసంగవైరి పతితు లిచ్చునది పక్వమైనను, అపక్వమైనను ప్రాణాపద దశయందును గ్రహింపరాదు. అందు వ్రతస్థవు కావున నీ కుపవాసము దగినదే. ఆయన నిష్కారణోపవాసము శాస్త్రనిషిద్ధము కావున నెట్లు శుష్కోపవాసము చేయవచ్చును. నిర్నిమిత్తమైన శుష్కోపవాసము ఆత్మహత్య యగును. అది దోషావహము. శోకము, కోపము నుపవాస కారణములు గావు.

2. దోమలు లీఁగలుఁ బురుగులుఁ, బాములుఁ దను నెరియ మీఁదఁ ♦ బ్రాకుచు నున్నన్
రాముఁ డెఱుంగఁ డొకింతయు, భామిని! నీ యందె యుంచి ♦ ప్రాణము లెల్లన్.

అర్థములు. ఎరియన్ = మండునట్లు, భామిని = కోపశీలా !

తాత్పర్యము.

ఆయన నిమిత్తమై నా దేహమునఁ బ్రాణములు నిలిపిన దాన నంటివి. ఆయన తన ప్రాణము లన్నియు నీయందు నిలిపియుండు వాఁడగుటచే ఈఁగలు,

ఘనమజఖండయుక్త మగు • తోయజశాత్రవమండలంబు నా
యామిని బోలి భామిసుతి • యంబనవందనుతోడ నిట్లనున్. ౪౭౯

అర్థములు. పొంగి = సంతోషించి, రామసమానశోక = రాముని శోక మెంత తీవ్రమో యంత తీవ్రత గల శోకము గలది. రాముని శోకము సీతకుఁబోదు. సీత శోకము రామునకు పోదు. తీవ్రత యందు సమత్వము. వచ్చె = మార్గము. శరత్ + ముఖంబునన్ = శరత్కాలారంభమందు. ఘనమజ = మేఘముయొక్క, ఖండ = తునుకలతో, యుక్తము = కూడినది. తోయజశాత్రవ మండలంబు = చంద్ర మండలము; కో=కల, యామిని = రాత్రి.

తాత్పర్యము.

హనుమంతుఁడు రామచంద్రమూర్తిని బొగడుటచే సంతోషించినదై రాముని దుఃఖమంత దుఃఖము గల సీత, నా దుఃఖమంత దుఃఖము రామచంద్ర మూర్తియుఁ బడుచున్నాఁడుకదా! తనదుఃఖముఁ బాపుకొన యత్నించునుకదా, యదియే నాకుఁ జాలునని తనదుఃఖమును వదలి శరత్కాలారంభమందు మేఘము తునుకలతోఁగూడిన చంద్రమండలము గల రాత్రివలెనై యామునతో నిట్లనియె.

ఇందలి యుపమానమువలన సీతాదేవి దుఃఖమంతయుఁ బోలేదనియు నింకను గొంతశేషము గలదనియు చెప్పుచున్నది. కారణము క్రింది పద్యమునఁ గలదు.

—•{ ౩౭-వ సర్గము. సీతాదేవి హనుమంతునితో రావణుఁడు పెట్టినగడువు నెఱింగించుట. }•—

క. రాముఁ డనన్యమనస్కుఁడు, రాముఁడు ఘోరవ్యథాప • రాయణుఁ డనుచున్
నీ మాటలు సుధ విషమున, నామాం! కలిపి యిడిన • చందం బయ్యెన్. ౪౮౦

అర్థములు. అనన్య మనస్కుఁడు = ఇతరమునందు మనస్సు లేనివాఁడు, ఘోరవ్యథాపరాయణుఁడు=గొప్ప బాధ పూర్ణముగ ననుభవించు చున్నాఁడు. సుధ = అమృతము.

తాత్పర్యము.

ఆంజనేయా! రామచంద్రమూర్తి నన్ను దప్ప మఱిదేనిని దలఁచుటలే దంటివి. ఇది యమృతము త్రావినంత సంతోషము గలిగించెను. రామచంద్రమూర్తి మిగుల దుఃఖించుచున్నాఁ డంటివి. ఇది విషము త్రాగినట్లు తాపము గలిగించు చున్నది. నీవు విషము కలిసిన యమృతము నిచ్చిన ట్లయ్యెను.

క. ఘోరతరైశ్వర్యమునకొ, దారుణదుఃఖమున నేని • దైవము త్రాటన్
బూనుపఁడఁ గట్టి యీడ్చును, ధారుణిపై జీవికిని స్వా • తంత్ర్యత గలదే! ౪౮౧

అర్థములు. ఘోరతర+ఐశ్వర్యమునకో = గొప్ప సంపదయందుఁగాని, దారుణ దుఃఖమున నేని=భయంకర దారిద్ర్య దుఃఖమందైనను.

తాత్పర్యము.

గొప్ప సంపదయందుఁగాని, భయంకర దారిద్ర్య దుఃఖమందైనను పురుషుని దైవము (పూర్వజన్మ కర్మఫలము) త్రాటితోఁ గదలకుండఁ గట్టి యీడ్చును. భూమియందుఁ బుట్టిన వారికి స్వాతంత్ర్య మనునది యున్నదా? లేదు.

ఆ. విధిని దాఁటు జీవి • విశ్వంబునను లేదు, వానరేంద్ర! యింత • పట్టు నిజము
రామచంద్రవిభుని • సౌమిత్రినిన్ నన్ను, నెట్లు పఱచెఁ గంటి • వే కడయ్య. ౭౭౨

అర్థములు. విధిని = దైవమును, పఱచెన్ = బాధపెట్టెనో.

తాత్పర్యము.

దైవనియమమును నతిక్రమించి స్వతంత్రించి తన యిష్టప్రకారము వర్తించు ప్రాణి యీ లోకమందు లేదు. వానరశ్రేష్ఠా! యింతమాత్రము నిజము. అసత్యము గాదు. రామచంద్రమూర్తిగాని, లక్ష్మణుఁడుగాని, నేనుగాని దుఃఖపడవలసిన కారణమూ లేదు. అయినను దుఃఖించుచున్నాము. దుఃఖించుటకు మాయందే దోషము గలదు? రామునికై నేను, రామచంద్రమూర్తి నా యపరాధములకై దుఃఖపడవలసినదే యగునో. మా యిరువుర నడుమ లక్ష్మణుఁ డేల మా యిరువురకై దుఃఖపడవలె! ఇదంతయు దైవచేష్టగదా.

ఉ. ఎప్పుడు చేరువాఁ డొకొ ది • నేశకులాభరణంబు రాముఁ డీ
గొప్ప వ్యథాసముద్రమున • కూలముఁ? బెద్ద తుపానుతాఁకునన్
ద్రిప్పుల నొందు నావగతిఁ • దేజ దొఱంగి నలంగినాఁడె! న
న్నెప్పుడు గొంచుఁబోవునొ? • నెప్పుడు రావణుఁ ద్రుంచు? మారుతీ! ౭౭౩

అర్థములు. దినేశకులాభరణంబు = సూర్యవంశమునకు నలంకారమైనవాఁడు, సముద్రమున కూలము=సముద్రమునకొక్క తీరము,షష్ఠీసమాసమున నకారాగమము.

తాత్పర్యము.

మారుతీ! రామచంద్రమూర్తి యీ వ్యథాసముద్రమున మునుఁగకుండఁ దీర మెప్పుడయ్యా చేరును! పెద్ద గాలివానవలన గిరగిర తిరుగు నావవలెఁ గాంతిని బాసి నలఁగినాఁడా? నన్నెప్పుడు తోడుకొని పోవునో, ఎప్పుడు రావణు సంహరించునో?

'పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతా'మ్మన్నట్లు సీతాదేవిని గ్రహించుట యను సాధు పరిత్రాణము ముఖ్యకార్యము దానికి విఘ్నము కలిగించు దుష్కృతుల వినాశము రెండవ కార్యము, అని చెప్పుచున్నది.

ఉ. ఎప్పుడు వచ్చు నొక్కొ మను • జేంద్రుఁడు? కాంచనకోటిఁ బట్టి తా
నెప్పుడు ద్రచ్చు నొక్కొ? ధను • జేంద్రునిఁ గిట్టి శరాలి పాలుగా
నెప్పుడు ద్రుంచు నొక్కొ? యసు • రేంద్రుని వీటిని మూలముట్టుగా
నెప్పుడు గాంచు నొక్కొ? నను • నెప్పుడు చూచెడి నొక్కొ? పావని! ౭౭౪

తాత్పర్యము.

పావనీ ! రామచంద్రమూర్తి యెప్పు డయ్యో వచ్చును. ఎప్పు డయ్యో రాక్షస సమూహములను బట్టి చీల్చును. రావణుని బాణముల పాలు చేసి యెప్పుడు ఖండించును! ఈ లంకాపురమును బూదితోడఁ బాడగునట్లు యెప్పుడు దంచునో, నన్నెప్పు డయ్యో చూడవచ్చును ?

ఉ. తీవర పెట్ట నయ్యె జగ•తీవిభు నింతటిలోన రాఁగ నో
పావని! నా కిలన్ బ్రదుకు•పాటును నీ సమ తీఱునంతకే
యా విధియించె నట్లు దను•జుం, డిఁక మాసయుగంబ చిక్కె ద
త్తావధియందుఁ, దెల్లెసిఁ జా•వగు దశమం బగు మాస మిన్యెడన్. ౮౮౫

అర్థములు. సమ=సంవత్సరము; ఇది సంస్కృతమున స్త్రీలింగము. ప్రాయికముగ బహువచనమందే ప్రయోగము, అయినను శాకిని ఏకవచనమందు 'సమాం సమాం' అని పఠించెను. (పా. వ్యా. ౫. ౧౨) మఱియు సమాం విజాయతే యని యేకవచనమందును బ్రయోగముకలదు. కావునఁ దత్సమమున సమ యను రూపము సాధువు. దత్తావధి = ఇయ్యఁబడిన గడువు.

తాత్పర్యము.

ఆంజనేయా! రావణుండు నాకొక్క సంవత్సరము గడు విచ్చెను. ఆ సంవత్సరము ముగియువఱకే నేను జీవించియుండుదును ఆ సంవత్సరమునందుఁ బదియవ నెల జరుగుచున్నది. కావున రెండు నెలలు మాత్రమే మిగిలినవి. అవి కాఁగానే నా చావు సిద్ధము కావున నీ లోపలనే వచ్చునట్లు రామచంద్రమూర్తిని తొందర పెట్టుము. ఆవల వచ్చినను ఫలము లేదు.

ఇది ఫాల్గున మాసము. ఇది పదియవ నెల యగుటచే జ్యేష్ఠమాసమున సీతాపహరణ మని యేర్పడుచున్నది.

ఉ. పెక్కువిధాలఁ దమ్ముఁడు వి•భీషణుఁ డెంతయు నొక్కి చెప్పె నీ
వక్కమలేక్షణన్ మఱల•నంపు మటంచును, పాలకింపఁ డా
మ్రుక్కడి రావణుండు, విధి•మూఁడినవానికి సాధుపథ్యముల్
మక్కువ గూర్పునే మరణ•మానము కన్నులఁ గప్పుచుండఁగన్ ! ౮౮౬

తాత్పర్యము.

ఈ లోపల మంచి బుద్ధి పుట్టి రావణుఁడు మఱల నన్ను రామచంద్రున కర్పింప రాదా యందువేమో, వానికట్టి యభిప్రాయములేదు. రావణుని తమ్ముఁడు విభీషణుఁ డను వాఁడు నీవు సీతను మరల నిమ్ము అని యనేక విధముల బోధించెను గాని మూర్ఖుఁ డగు రావణుఁడు విన్నవాఁడు కాఁడు. వానికి మరణకాలము సమీపించి మరణమానము కన్నులు గానరాకుండఁ జేయుచుండఁగా వాఁ డేల వినును ?

నింద్రుని శచివోలె • నెఱుఁగుము తన్వి, యంబుఁ గష్టంబు లా•మూనమునఁ
గలఁపగ జాలవు • కాండభానువులను, రక్షోజలంబుల • రామభానుఁ
తే. డడరి శోషింపఁజేయు నం • చశ్రుపూర్ణ, లోచనాంబుజ యైన యా•లోలనేత్రఁ
జూచి యిట్లను నంజనా•సూనుఁ డప్పు, డేల శోకించెదమ్మ! యీ•లీల నీవు. ౧౮-౧౯

అర్థములు. అపలకుండుము=భయపడకుండుము; కాండభానువులను = బాణము లను కిరణములచే, రక్షోజలంబులన్=రాక్షసులనునీటిని; రామభానుఁడు=రామచంద్ర మూర్తి యను సూర్యుఁడు; అశ్రుపూర్ణలోచనాంబుజము = కన్నీళ్ళచే నిండిన నేత్ర కమలములు గలది.

తాత్పర్యము.

ఆంజనేయా! ఆయన రాలేదు. రావణుఁ జంప లేదు. నన్నుఁ దీసికొని పోలే దని నిష్ఠుర మాడెదవే. ఆయన యొంటరిగాఁ డేమి చేయఁగలఁడమ్మా! యందు వేమో. ఆ జనస్థానమందుఁ దమ్ముఁడుకూడఁ దోడులేక పదునాల్గువేల రాక్షసులను భుజబలముచే నవలీలగాఁ జంపలేదా. అట్టివాఁడిప్పటికి వచ్చినంత మాత్రముననే యీ రాక్షసులు చూచి భయపడకుందురా. ఆయన శక్తి తెలియక నేను నూహింప లేను. ఇంద్రుని శక్తి శచికిఁ దెలిసినట్లు రామచంద్రుని శక్తి నాకుఁ దెలియును. సమానఘనుఁ డగు నతనిని నీ కష్టము లెవ్వియుఁ గలఁత చెందింప లేవు. ఎన్ని కష్టము లైన నోర్చి మానము కాపాడుకోఁగలఁడు. సూర్యునకుఁ దన కిరణములచే జలము నింకించుట మహాశ్రమకరమైన కార్యమా? అట్టులే రామునకు రాక్షసుల వధించుట కష్టకార్యమా! అని కన్నుల నిండ నీరు నించిన యా సీతాదేవిని జూచి హనుమంతుఁడు తల్లీ! యేల శోకించెదవు ?

—• హనుమంతుఁడు సీతాదేవిని దనవీఁపున నెత్తుకొని పోయెద నని చెప్పుట. •—

ఉ. నానుడు లాలకించి రఘు•నాథుఁడు వానరభల్లుకావళీ
సేనలతోడ నిచ్చటికి • శీఘ్రము వచ్చెడు, నంత కోర్వ నె
ట్లా నని లేని దుఃఖము ర•యంబుగఁ బాపు ననింద్యశీల! చం
ద్రానన! నాదు వీఁపుపయి • నాదట నెక్కుము కొంచుఁ బోయెదన్. ౨౦

అర్థములు. నా నుడులు = నా మాటలు; పాపుదున్ = పాపుదును, పోవు నట్లు చేయుదును.

తాత్పర్యము.

నా మాటలు విని రామచంద్రమూర్తి కోఁతులు, ఎలుగులు గల సేనలతో నిచ్చటికిఁ ద్వరగా వచ్చును. అంతకాలము వఱకు నీ వీ దుఃఖ మెట్లు సహింపఁగలవమ్మా? నీ దుఃఖమును నేను పోవునట్లు చేసెదను. నా వీఁపుపై నెక్కుము. రామచంద్ర మూర్తి యున్న చోటికిఁ దీసికొని పోయెదను. నేను నీ కింకరుఁడను. కావున దీనివలన నీ శీలమునకు హాని లేదు.

తా త్ప ర్య ము.

నా మాట లేమోలేయని యుపేక్షింపకుము. రోహిణీచంద్రులు కూడియుండు నట్లు నీవు నీ మగని కూడియుండునట్లు చేసెదను. ఆకాశమున సూర్యచంద్రులతో ముచ్చట లాడుచు సముద్రమును, సముద్రమును దాటిన తరువాత నాకాశమును నవలీల దాటుము. రామచంద్రమూర్తి యొద్దకుఁ బోవు వఱకు నిన్ను దింపను.

క. వినుమ నేఁ గొనిపోవఁగ న, న్ననుగమనము సేయ నోపఁ • డమ్మా ! లంకన్
దనుజుం డొక్కండైనను, వనమానము మాని యుక్కు-•మా నా వీఁపున్. ౨౫

అర్థములు. అనుగమనము = వెంటవచ్చుట.

తా త్ప ర్య ము.

ఈ రాక్షసులు మన వెంటబడఁగా, పోనిత్తురా యందువేమో, నిన్ను నేను దీసికొని పోవునపుడు నావెంట నీ రాక్షసులలో నొకఁడైన రాఁ జాలఁడు, నమ్ముము.

క. ఏకరణిని వచ్చితి నిట, నా కరణిని గొంచుఁబోదు • నాకాశమునన్
నీ కేల సందియం బన, నా కపిఁ గని హర్ష విస్మ•యాంగి వచించెన్. ౨౬

తా త్ప ర్య ము.

నీ వే విధముగ నాకాశమార్గమున నిటకు వచ్చితివో యావిధముగనే యాకాశ మార్గమున నిన్నుఁ దోడుకొని పోయెదను, నీ కేల సందేహము అనిన నా వానరుఁ జూచి సీత యతని భక్తికి సంతోషము, అతని మాటల కాశ్చర్యము గలదై యిట్లు చెప్పెను.

—• హనుమంతుఁడు సీతాదేవికిఁ దన దేహముఁ బెంచి చూపుట •—

క. హనుమా ! యిక్కడి దూరము, వనుఁగొని నీ వేగతిం జ•నం జాలెదవో
విన వింతలు నీ పలుకులు, వనచర ! నీ క్రోఁతిబుద్ధి • వచ్చెం దెలియన్. ౨౭

తా త్ప ర్య ము.

అంజనేయా! నేను సొమ్ములమూట కట్టి నెక్కడ దైచితినో నాకుఁ దెలియును. అక్కడకు నిక్కడకు మిగుల దూరముగలదు. ఇంతదూరము నన్ను మోచికొని నీ వే ప్రకారము పోఁగలవు. నీ మాటలు వినుటకు వింతలుగా నున్నవి. ఇంతవఱకు నీవు నిజమైన క్రోఁతి వగుదువో కావో యని సందేహించుచుంటిని. ఇప్పుడు నీబుద్ధిని బట్టి చూడ నీవు నిజమైన క్రోఁతివే యని నిశ్చయించుకొంటిని.

ఉ. ఇంతవు నీ వదేమి గతి • నేగెదవో నను మోసికొంచు భూ
కాంతునిపాలి కం చనిన • తా న్ససుతపల్కు-ల నాలకించి లోఁ
జింత వహించె నా కపుడు • చేసెతాఁ బ్రాత్తపరాభవం బటం
చెంతయు వానరుండు మఱి • యిట్లని తాఁ దలపోసె నాత్మలోన్. ౨౮

అర్థములు. ఇంతవు = ఇది చేతితోఁ జూపించి యింతవాఁడని చెప్పెను. అనఁగా అల్పశరీరుఁడవు. ప్రాత్తపరాభవంబు = ఎన్నఁడులేని యవమానము.

తాత్పర్యము.

హనుమంతా! యీడిచి కొలిచిన జేనెడు లేవే, నీ వెట్లు నన్ను మోసికొని రామచంద్రుని యొద్దకు నంతదూరము పోఁగల వనెదవు అనఁగా సీతాదేవి పలుకులు విని హనుమంతుఁ డిట్లు విచారపడెను. ఎన్నఁడు నెవరిచేతఁ గలుగని యవమానము, నేఁడు ఆఁడుదానిచేతఁ బడవలసి వచ్చెను గదా యని మఱియు నిట్లు లాలోచించెను.

చ. ఎఱుఁగదు గాక యించుకయు • నెంతటివాఁడనొ కానఁ బల్కె న
న్నుఱక మదీయరూప మిపు • డొప్పుగఁ జూపిన నమ్మఁ గాక యీ
తెఱవ యటంచు నెంచి తన • దివ్యమహాకృతిఁ జూప నేలపై
కుఱికి ద్రుమంబునుండి రభ • సోద్ధతిఁ బెంపఁ దొడంగె గాయమున్. ౭౯౯

అర్థములు. ఉఱక = లక్ష్యము లేక, ఉఱికి = దుమికి; రభసోద్ధతిన్ = వేగముతోడి గర్వముచే; నేలపై కుఱికి యనుటచే నింతవఱకు రాక్షసస్త్రీలకుఁ గాన రాకుండునట్లు చెట్టుకొమ్మమీఁదే యుండె నని యేర్పడుచున్నది. అవమానము సహింపలేక రోషము గలవాఁడై చెట్టుమీఁదనే యుండి దేహము పెంప సాధ్యపడదు కావున నేల దుమికెను.

తాత్పర్యము.

ఈమె నన్ను నవమానింపవలయు నను తలంపుతో నవమానింపలేదు. నే నెంతటి వాఁడనో, నా మహాత్మ్య మెట్టిదో తెలియక లక్ష్యములేక మాటలాడినది. నా మాట నిజ మని, నే నంత కార్యము చేయఁగల నని, నిజముగ నమ్మినది కాదు ఈమె నమ్మి నట్లు చేయుటకు నా స్వరూపము చూపించెద నని తలఁచి తన దివ్యమైన గొప్ప యాకారమును జూప నేలమీఁదికి దుమికి శీఘ్రముగాఁ బెంపఁ బ్రారంభించెను.

సీ. దీప్తానలప్రభఁ • దేజరిల్లుచు, మేరు, మందరసంకాశ • మహితరూప
ముసఁ దామ్రవక్త్రుఁడై • ఘనవజ్రసన్నిభ, దంష్ట్రానఖంబులు • దద్ద వెలుఁగ
జానకి ముంగల • గా నిలుచుండి యి, ట్లనియె నా సతితోడ • నాంజనేయుఁ
డో దేవి! సగిరివ • నోద్దేశముగ సాట్ట,వప్రతోరణముగ • వైరినాథు
ఆ. తోడ లంకఁగొనుచుఁ • దోరంపుజవమునఁ, బోవు శక్తి గలదు • భూమితనయ!
పిన్న వాఁడ నను న • భిప్రాయమును బాసి, రమ్ము జాల మేల • రాము కడకు. ౮౦౦

అర్థములు. దీప్తానల ప్రభన్ = మండుచున్న యగ్నిహోత్రుని కాంతితో; సంకాశ = సమానమైన; మహిత = గొప్పదైన; తామ్రవక్త్రుఁడై = రాగివలె నెఱ్ఱని ముఖము గలవాఁడై; ఘన = గొప్ప వగు; వజ్ర సన్నిభ = వజ్రముతో సమానమైన; దంష్ట్రానఖంబులు=కోఱలు గోళ్లు, సగిరివనోద్దేశమున్=పర్వతములు, వనప్రదేశములతోడ; సాట్టవప్రతోరణముగ=బురుజులతో, ప్రాకారములతో, తోరణములతో.

తా త్ప ర్య ము.

మండుచున్న యగ్నిహోత్రకాంతి గలిగి, వెలుఁగుచు మేరుమందర పర్వతము లతో సమానమైన గొప్ప యాకారముగలవాఁడై, నెఱ్ఱని ముఖము, వజ్రాయుధముల వంటి గోళ్ళు, కోఱలు గలవాఁడై, సీతాదేవి ముందు నిలుచుండి యిట్లనియె. దేవీ! ఈ లంకను గొండలతో, వనములతో, బురుజులతో, ప్రాకారములతో, తోరణము లతో, రావణాసురునితో పెల్లగించి యతివేగమునఁ దీసికొని పోవు శక్తి గలదు. నేను జిన్నవాఁడ నను నభిప్రాయము వదలుము. ఆలస్య మేల? రాము నొద్దకుఁ బోదము రమ్ము.

—• హనుమంతునితోడ సీతాదేవి తాను రామికిఁ గారణములు చెప్పుట •—

చ. అవునను వాయుసూనుని మ•హాద్భుతభీప్రదభూరి రూపమున్
గనుఁగొని నీరజాక్షి యను • గాడుపునందనుతో నతింగితిన్
ఘన మగు తావకీనబల•గర్వసమున్నతి వాయువేగమున్
వనదహనోరు తేజమును • వానరమాత్రుఁడవే కపీశ్వరా! ౯౦౧

అర్థములు. మహాద్భుత = మిగుల నాశ్చర్యకర మైన, భీప్రద = భయము కలిగించు; భూరి = గొప్పదగు, రూపమున్ = ఆకారమును, వనదహన = కాఱు చిచ్చు తేజస్సువంటి; ఉరు = గొప్పదగు; తేజము.

తా త్ప ర్య ము.

హనుమంతుఁ డీ ప్రకారము చెప్పఁగా మిగుల నాశ్చర్యము,భయము కలిగించు నతని గొప్ప యాకారము చూచి యాయనతో నిట్లనియె. కపీశ్వరా! నీ బలగర్వము, వాయువేగము, కాఱుచిచ్చువంటి నీ తేజము, నెట్టిదై నది తెలిసికొంటిని. నీవు సామాన్యపుక్రోతివి గావు.

ఉ. ఇంతటివాఁడవు గాక యది • యెట్లు పయోధిఁ దరించి లంక నే
కాంతము జొచ్చి న న్నరయఁ•గా క్షముఁ డౌ? నొక ప్రాకృతుండు దా
నింత ఘటింప నేర్చునె? య•హీనజవంబున నన్ను రామ భూ
కాంతుని యంతికంబునను • గ్రచ్చఱఁ జేర్తువు విశ్వసించితిన్. ౯౦౨

అర్థములు. ఏకాంతము = రహస్యముగా; క్షముఁడు = సమర్థుఁడు; ప్రాకృతుండు = సామాన్య పురుషుఁడు, అంతికంబునకు = సమీపమునకు; విశ్వసించితిన్ = నమ్మితిని.

తా త్ప ర్య ము.

ఇంత గొప్పవాఁడవు కావేని, నీ విట్లు సముద్రము దాఁటి రహస్యంబుగ నొంటిగ లంకలోఁ బ్రవేశించి నన్ను వెదకి కనుఁగొన సమర్థుఁడ వగుదువు. ఇంతకార్యము సామాన్య పురుషులకుఁ జేయ సాధ్య మగు పనియా? మిగుల వేగముగ నీవు నన్ను రామచంద్రమూర్తి సమీపమునకుఁ దీసుకొని పోఁగల వని నమ్మితిని.

సీ. అయినను మామకీ•నాత్మేశు కార్యంబు, వేగంబు సిద్ధించు•విధ మదెట్లొ
యని తలపోయుట • యావశ్యకము నాకుఁ, గాదె? నీ వెంట రా•రా దటంట
ననిలవేగము తుల్య • మగు నీదు జవమున, కోర్వక దిగ్భ్రమ • యొదవు నాకుఁ
బైపైన బొరలు కూ•పారంబుఁ గన భీతిఁ, దల చుట్టి పడిపోనె • దానిలోనఁ
తే. బడిన యంతనె తిమినక్ర•పటలి నన్నుఁ
బట్టి చవు లూరఁగా భ్రమింగి • యట్టె పోవె?
నన్ను రక్షింపఁ దలపోయు • చున్న నిన్నుఁ
గూర్చియును సంశయించెదఁ • గ్రోతిరాయ. ౬౦౩

అర్థములు, మామకీ నాత్మేశు కార్యంబు = నా యాత్మకు నధీశ్వరుఁడైన రామచంద్రమూర్తి కార్యము త్వరగా సఫల మగు విధ మేదో యది నే నాలోచించుట తగును గదా. కావున నీ వెంబడి నేను రాను. నేను నీవెంట వచ్చితినా.

(౧) రావణుఁడు దొంగతనముగా సీతను హరించుకొని పోయినట్లు రామచంద్రుఁడును రావణాసురుని జయింపలేక దొంగతనముగా సీతను దెప్పించుకొన్నాఁడు, హనుమంతుఁడు లేకుండిన రామచంద్రుఁడు సీతను దక్కించుకొని యుండలేఁ డను నపకీర్తి నా మగనికి వచ్చును. నే నట్టి కార్యము చేయవచ్చునా?

(౨) నే వచ్చుటకి వచ్చితినేని నా ప్రాణము దక్కించుకొన్నట్టు లగును గాని యింత దుష్టకార్యము స్త్రీల విషయమునఁ జేయు వీని కేమి శిక్ష గలిగినట్లు? ఇట్టివాఁడు శిక్షింపఁబడఁడేని యింకను లోకమున నెన్ని యనర్థకార్యములు చేయునో.

(3) రామచంద్రమూర్తి తప్ప రావణునిఁ జంపఁగలవాఁ డెవ్వఁడు. ఎందఱు స్త్రీలనో నావలెనే బలాత్కారముగఁ దెచ్చి చెఱలో వేసియుండుట నీవు చూచితివి కదా. వారి మగవా రెవ్వరైన వానిని దండింపఁగలిగిరా? కావున రామచంద్రమూర్తి చేతనే వీని పుట మార్పింపఁజేసిన నీ స్త్రీ లందఱు సుఖముగఁబోకురు. క్రొత్త వారు రాకుండురు.

(౪) రామచంద్రమూర్తి రావణుఁ జంపఁ బ్రతిజ్ఞఁ జేసెఁగదా. నే వచ్చుటకి వచ్చితినేని యిది నెఱవేఱు టెట్లు? ఆయన సత్యప్రతిజ్ఞత్వమునకు హానిరాదా? నాయందు భక్తిగలవాఁడ వగుటచే నా సుఖము మాత్రము చూచితివిగాని, యివన్నియు నాలోచింప వైతివిగదా. ఇకను జెప్పెద వినుము.

కూపారంబు = సముద్రము; చవులు = రుచులు.

తాత్పర్యము.

నీయందు నాకెంత విశ్వాసమున్నను శీఘ్రముగ నా మగని కార్యము సిద్ధించు నుపాయము నే నాలోచించుట యావశ్యకము గదా. కావున నీ వెంట నేను రారాదు. వాయువేగముతో సమానమైన నీ వేగము సహింపలేక నేను దిగ్భ్రమ నొందుదును. మీఁద మీఁద బొరలుచున్న యలలు గల సముద్రమును జూడఁగానే దానిలో

దలతిరిగి పడిపోదును పడఁగానే తిములు మొసళ్లు వచ్చి నన్ను రుచులార మ్రింగి స్వేచ్ఛగాఁ బోవును. ఇది నాగతి. ఇఁక నీ గతి విషయ మందును నాకు సందేహము గలదు. ఏ మంటివా ?

సీ. ననుఁ గొనిపోయెదు ని•శ్చని పంక్తికంధర, చోదితరాక్షస•శూరవరులు
నిను వెంబడింపరే! • నీకును వారికిఁ, జండసంగ్రామంబు • జరుగకున్నె !
శూలముద్గరక రా•ళీలురు వారల, గెలుతువో ! కలనిలో • గెలువ లేవొ ?
సాయుధుల్ వారు ని•రాయుధుండవు నీ వ, దెట్లు పోరెదవు న•న్నెట్లు గాతు ?

తే. నీవు కలహింపఁ గ్రూరదు • ర్భావు లైన
దైత్యులను గని నా మది • తల్లడిల్లి
వనధిలోపలఁ బడుదునో ! • పడిన నన్నుఁ
గొనుచుఁ బోయి యొసంగరే • దనుజపతికి ! ౯౦౪

అర్థములు. చోదిత = ఆజ్ఞాపింపఁబడిన; క్రూరదుర్భావులు = చెడ్డమనస్సు గలవారు.

తాత్పర్యము.

నన్నుఁ దీసికొని పోవు నిన్నుఁజూచి రావణుచే నాజ్ఞాపింపఁబడిన రాక్షసులు నీ కంటఁబడరా ? వారికి నీకు భయంకర యుద్ధము జరుగకుండునా ? వారు శూలములు, ముద్గరములు కలవారగుటచే దూరమునుండి నిన్నుఁ గొట్టుదురు. వారలను నీవు గెలుతువో గెలువలేవో. గెలుపోటము లెట్లున్నను ఆయుధములు కలిగి దూరము నుండి గొట్టువారితో నాయుధములు లేని నీ వెట్లు యుద్ధము చేయఁగలవు ? న న్నెట్లు రక్షింపఁగలవు ? నీవు వారియొద్దకుఁ బోయికదా కొట్టవలెను. వారు నాలుగుప్రక్కల నిన్నుఁ జుట్టుకొని యాయుధములతోఁ గొట్టునపుడు నీవు ముఖ మొకవైపు తిరిగి పోరునపుడు వెనుకటి నన్నుఁ గొట్టరా ? ఆ దెబ్బలు నాకుఁ దగులవా ? దెబ్బలు తగులకుండినను క్రూరులు చెడ్డ మనస్సుగల రాక్షసులను జూడఁగానే నా మనస్సు తల్లడిల్లదా ? నేను సముద్రములోఁ బడిపోదు నేమో ? నేను బడిపోఁగానే వారు నన్నుఁ బట్టుకొని పోయి రావణున కీయరా ?

ఉ. పోరుపయిన్ మది న్నిలిపి • పోరుచు నుండెడివేళ నీవు నే
వారిధి జాఱి త్రెళ్ళినను • వారు బలాత్కృతిఁ గొంచుఁ బోయినన్
శూరత నిన్ను గెల్చినను • జొప్పు చెడుం గదే! నన్ను రాక్షసుల్
క్రూరత ముక్కముక్కలుగఁ • గోయరె వారలచేతఁ జిక్కినన్ ? ౯౦౫

తాత్పర్యము.

నీమనస్సంతయు యుద్ధముపై నుంచి యుద్ధముచేయునపుడు నేను జాఱి సముద్రములోఁ బడినను వారు బలాత్కారముగ నన్నుఁ దీసికొని పోయినను, నిన్ను వారు గెలిచినను క్రమమార్గము తప్పునుగదా. వారిచేఁ జిక్కిన ముక్కలు ముక్కలుగాఁ గోయరా ?